అంకితము

పాలపర్తి
రామబ్రహ్మంగారికి

# పీఠిక

ఈ కథా సంపుటికి 'గళ్ళచీర' అని పేరుపెట్టడంలో కథకుడి ఉద్దేశ్యం గృహస్థాశ్రమానికి సంబంధించిన చిత్రాలు చూపించడమేమో అని తోస్తున్నది. ఇంగ్లీషు కథకులు తమ కథా సంపుటాలకు పేరు పెట్టేటప్పుడు అందులో ప్రధాన కథ పేరు సంపుటికి ఉపయోగిస్తారు. రాఘవశాస్త్రి గారు కూడా పాశ్చాత్యసాహిత్యాలు బాగా చవిచూచినవారు కావడం చేత ఆ మార్గం అనుసరించారు.

గళ్ళచీర అన్నప్పుడు కొంతమందికి కేవల స్త్రీ ప్రశంసే యీ కథలో వుంటుందన్న అనుమానం కలుగుతుం దేమో. పరిశీలిస్తే అటువంటి సంశయానికి ఏమాత్రమూ అవకాశం లేదు. కామోద్రేకానికి కారణభూతమైన వర్ణనలు ఈ సంపుటిలో లేనే లేవు. కాముక వ్యాపారాల్ని వర్ణించి నరాలకి అలజడి కలిగించ దలచుకొనే మతములో చేరినవాడు కాడు ఈ కథకుడు.

'జడకుచ్చులలో' రాయప్రోలు సుబ్బారాయకవి ఆంధ్ర కుటుంబాలలో వుండే కొన్ని రమణీయ విషయాలను పద్య రూపంగా వర్ణించినాడు. ఈ కథకుడు గద్యరూపంలో కొన్ని చమత్కార సన్నివేశాలను ముద్దు ముద్దుగా ప్రదర్శించినాడు. గార్హస్థ్య జీవితము మనోహరమైనదనీ, చమత్కారపూర్ణ మైనదనీ, ఉత్తమమైనదనీ, యీ కథకుని అభిప్రాయమైనట్టు స్పష్టము.

నిస్సంకోచంగా ఈపుస్తకం స్త్రీ పురుషు లందరూ చదవవచ్చు. యువతులకు గాని, యువకులకు గాని ఉద్రేకము కలిగించే విషయ విస్తృతి యిందులో కనపడదు. ఆలాగని కథలలో చప్పదనం లేదు. పుస్తకం పాఠకులను ఉద్రిక్త హృదయులనైనా చెయ్యాలి, శాంత చిత్తులనైనా చెయ్యాలి. ఈ సంపుటి మధ్య మధ్య మనస్సునకు కొంత ఉత్తేజనము కలిగించినా, శాంతములోనే పర్యవసన్న మాతున్నది. చిత్తశాంతి కలిగించడం గొప్పసంగతి.

గృహస్తజీవనము చిత్రించడంలో మునిమాణిక్యం నరసింహారావు గట్టిచెయ్యి. ఆయన "కాంతం కథలు" కథాసాహిత్యంలో మనోహరమైన సృష్టి. "కాంతం కథలకూ" "గళ్ళచీరకూ" కొంత సాదృశ్యమూ, కొంత భేదమూ వున్నవి. మునిమాణిక్యం కాంతం అనే పాత్రను సృష్టించి సమస్తసన్నివేశాలూ ఆమె చుట్టూ తిరిగేలాగునే యేర్పరచి, ఒకానొక కుటుంబజీవనం ప్రదర్శించాడు. ఈ కథకుడు ఏదో ఒక కుటుంబమునే ప్రత్యేకంగా నిర్ణయించకుండా సామాన్య బ్రాహ్మణ కుటుంబములలో సంభవించే ఘటనలు కొన్ని ఏర్చి కథలు కూర్చినాడు.

ఇందులో ఇంకొక విశేష మున్నది. ఈ కథల్లో స్త్రీ పురుషులు నవీన నాగరికతా సంపర్కమున్నవారు. కేవల గ్రామాల్లోనే కాక పట్టణవాసానికి బాగా అలవాటు పడినవారు. అందుచేతనే అక్కడ జరిగే వింతలూ, వినోదాలు, అన్నీ తెలిసినవారు. వారి వేషభాషలు, ఆచారవ్యవహారాలూ, గ్రామవాసుల పద్ధతులకంటె భిన్నంగా వుంటవి. నవీన నాగరిక తంటే బొత్తిగా ఏవగించుకొనేవారిమాట చెప్పలేము.

కాని వీటిలో పాత్రలు అందరికీ హృద్యముగానే వుంటవని చెప్పవచ్చు.

ఉచితమైన వ్యావహారిక భాషలో ఈ కథలు వున్నవి. వికృత ప్రయోగాలు లేకుండా, అప్రామాణిక పదాలు లేకుండా, నేయార్థములు లేకుండా, భాష బాగా నడుస్తున్నది. అక్కడక్కడ ఇంగ్లీషు వాక్యరచనను దూరంగా స్ఫురింపచేసే గమనాలు వున్నా మొత్తంమీద రీతి జాతీయాలతో కూడి సరసముగా వున్నది.

కేవల కవివాక్యరూపమే కాకుండా సరసమైనసంభాషణ రూపంకూడా రచనలో మిళితమైంది. మృదువుగా నర్మంకూడా అంతర్లీనమై ఉన్నది. కథలు నర్మగర్భంగా వుండడం స్వాదుత్వహేతువు.

సంపుటి ముగించి సింహావలోకనంచేస్తే తెలుగుకుటుంబాలలో నిహితమైవున్న మాధుర్యం ప్రస్ఫుటమౌతుంది. ఈ కథకుడు ఇంకా యిటువంటి కథలు రచించి ప్రకటింపవలెనని నాకోరిక.

బెజవాడ
జూన్, 1936

తల్లావఝ్ఝల
శివశంకరశాస్త్రి

# గళ్ళచీర

నాకు సిగరెట్టు అలవాటైన వేళావిశేష మేమోగాని అది నన్ను వదలకుండా వచ్చింది. వదిలేద్దామన్న అభిప్రాయం నా కేకోశానా లేదులెండి. పూర్తిగా దమ్ముపీల్చి పొకగా పెదవుల చివరనుంచి పొగ వదలివేయడమంటే నాకు చాలా సరదా. కాని నాభార్యకుమాత్రం కొద్దిగా కోట్టుగా వున్నది. 'మీరు సిగరెట్టు కాలవకపోతే మనకు; మామూలు ఆఫీసు గుమాస్తాకిచ్చేజీత మైనా కాగలదు; నాకు నెలకొకటి మంచి చీర అమరుతుంది' అంటూాంటుంది అప్పుడప్పుడు. మాంచిచీర లంటే పాపం పిల్లకు ఉబలాటమే. దీనికితోడు సొమ్ములమీద కూడా అపేక్షవుంటే చచ్చిపోయేవాణ్ని, అదిలేదు. ఒడలు నిండా బంగారం దిగవేసుకుని ఒక కోమటి పిల్లలాగా తయారగుదామన్న ఉద్దేశ మామెకులేదు. పచ్చినాగరీకం. అయితే అయింది. అందుకోసం నేను సిగరెట్టు కాల్చడం మానేయాలట!

ఆనాడు పొద్దున్నే స్నానం గీనం చేసుకుని మేజా ముందున్న కుర్చీలో వాలి షేక్స్పియర్ మహాకవి వ్రాసిన నాటకం హేంలెట్ చదువుకుంటున్నాను. ఊరికే కూలాసాగా కాలంగడిపేటందుక్కు కాదు; పరీక్షలు నడ్డిమీద తంతున్నాయి వెనుకనుంచి. సరిగ్గా నెలరోజులున్నాయో, లేదో. ఈవరకు మూడుసార్లు తప్పివున్నాను. అయితే ఏం! తప్పిన తప్పు మాత్రం నామీద లేకుండా పోయింది. 'పెళ్ళైంది, తప్పు

తున్నాడు, పాప' మనేశారంతా. అపరాధమంతా ఇంతవరకూ నాభార్యే మోస్తున్నది. ఈ తఫా అన్నా ప్యాసై బి. ఏ. డిగ్రీ తెచ్చుకోకపోతే ఆమెకు బహు వెక్కువయ్యేలాగున్నది.

ఐదునిమిషాలు బుర్రవంచి జాగ్రత్తగా చదివేను చూపుడు, బొటనవ్రేళ్ళతో పట్టుకున్న పెనసలుకొనతో క్రాపింగు పాపట తీసికుంటూ. ఇంతలో అకస్మాత్తుగా సిగరెట్టు జ్ఞాపకంవచ్చింది. ఈ రోజు పక్కమీదనుంచి లేచిన లగాయతు అగ్నిహోత్రం వెలిగించలేదు. అలమారలో వున్న సిగరెట్ పేకట్టు తెచ్చుకుందామని కుర్చీలోనుంచి లేచాను. కుర్చీ వెనుక ఎంతసేపటినుంచీ అలా నిల్చివున్నదో లీల చిరునవ్వు నవ్వుతున్నది. నేనలాగేచూస్తూ నిలబడిపోయాను. 'ఏమిటి? అలాచూస్తారు? భయపడ్డారు కాబోలు, పీపు నరవనా?' అన్నది లీల.

'నిజంగాచూస్తే భయంగొలిపే వేషంమీదే వచ్చావు కాని, నేను దడుచుకోలేదు. నవ్వుకుంటున్నాను.'

ఒక్కసారి లీల తన్ను తాను సింహావలోకనం చేసికొన్నది. చీరకొంగు రెండుచేతులా పట్టుకుని తలవంచి చూచుకుంటున్నది.

ఆమె కట్టుకున్న చీరమీద గళ్లు పెద్దపులి మచ్చల్లాగా వున్నవి. అందుచేతే మొదలు నేనుకొంచెము భయపడవలసి వచ్చింది. చీరలు వర్ణించడం నాకుచేతగాదుగాని నాకాచీర బాగుండలేదనిమాత్రం చెప్పగలను. 'ఛీ, బాగా లేదుచీర'; అని ముఖాన అనేసి లీలను వుడికిద్దా మనుకున్నానుగాని

ఆపూట చదువుకునే ప్రాప్తివుండదు. ఆమె చేసిన పని ఏదైనా—కూరలో ఉప్పుచాల్లేదనిగాని, అన్నం మెత్తపడిం దనిగానీ, అంటే ఆమెకు ఎక్కడలేని కోపం వస్తుంది. ఆమీద ఉపన్యాసమనే జడివాన ఒకటి నేను ఎదుర్కోవాలిసి వుంటుంది. జంతువులవలె మూగచేష్టలతోనే భావప్రకటనచేసి కోవలసిన దశపోయి మానవుడు భాష కల్పించినప్పుడు నాగ రికప్రపంచమున చాలదూరము నడచినాడు. అందు వివేచనా జ్ఞానము తెచ్చినప్పుడు పై మెట్టెక్కినాడు. ఈ ద్వితీయదశకు మాత్ర మింకను స్త్రీ రాలేకున్నది.

మేజామీద ఓరగా కూర్చోటానికి ప్రయత్నిస్తూ అన్నాను. 'నేను పర ధ్యానంలో వున్నప్పుడల్లా వెనుకనుంచి వచ్చి కళ్ళుమూసేదానివి; ఇదేమి టిప్పుడు కిక్కురుమనకుండా వెనుక నిల్చున్నావు దొంగలాగా.'

'ఔను. దొంగను గనుకనే' అని ఒక కురుచజవాబు.

'నా కోటు జేబులో అయిదురూపాయల నోటు మా యమయిందా ఏం?'. లీల నవ్వుతున్నది.

'అది చీరలుకొంటానికి కాదు ఉంచాను'

'మరి సిగరెట్ కొట్టువాడి కివ్వాలనా?'

'అన్నట్లు జ్ఞాపకంచేశావు. అలమారులో సిగరెట్ ప్యాకెట్టు వున్నాది, తెచ్చిపెట్టు.'

'మీ రివ్వాళ కాఫీమాటే అనుకోలేదే; ఇంత పొద్దె క్కినాను?'

'నీవుచేసి ఇస్తేకదూ! గళ్ళచీరలు సింగారించుకోవటం తోనే కాలచక్రం తిరిగిపోతున్నది.'

'కాఫీ వ్రంచాను. ఇవాళేమీ మాట్లాడకపోతే ఈ రోజునుంచి కాఫీయిమానేస్తారేమో అనుకున్నాను.'

'ఓహో! ఇన్నాళ్ళూ సిగరెట్ మానమనీ! ఇప్పుడు కాఫీమానమంటేనా; బాగుంది! నీ కేం, చెప్పు అప్పుడుకూడా మానేయమంటావు. తనముక్క కాకపోతే కాశీదాకా దేకేయమన్నాట్ట ఒక ప్రజ్ఞావంతుడు.'

నవ్వుకుంటూ కాఫీపట్టుకరాబోయింది లీల. నేను అలమారవైపు నడచేను. అక్కడ తగిలించివున్న కోటుజేబులు వెతికేను ముందర, అయిదురూపాయల నోటు వున్నదో మాయమైందో అని. పాపం దాని ఆయుష్యం బాగున్నది కాబోలు; ఇంకా దాని కళ్ళపడలేదు. పడితే ఏ చీరలమ్మేవాడి దగ్గరకో పోయేదే. నే నేమన్నా అంటానేమోనన్న భయం లేకపోతే లేకపోయింది, వెనుకాముందు ఆలోచన కూడా లేదు లీలకు. పైసా కనుపిస్తే బ్రతుకనీదు. పూర్వార్జిత పూర్తిగా వున్నందున బ్రతికిపోతున్నానుగాని, మా మూలుపాటివాడినే అయితే, మూడోనాటికల్లా చిప్పా కర్రా చేతికివచ్చేవే. సాయిబయ్య సంపాదనంతా బాబు చెవిపోగులకన్నట్టు, వచ్చేఆదాయమంతా భార్య చీరలకు ఖర్చుపెడుతుంటే, మరేమిటి? అందులో మా లీలకు సామాన్యపు చీరలు నచ్చవు. విలువగల పట్టువి పెట్టెలో చాల వున్నా చాలని లేదు. అధికస్య అధికం ఫలం.

అలమార తెరచిచూస్తే సిగరెట్టు పెట్టె లేదక్కడ. ఇం కేం. దాచేసిందన్నమాట. 'ఔను దొంగను గనుక నే' అన్నమాట కిదే అర్థం. పొడుముకాయ తీసిదాస్తే తాతకు

కోపంవచ్చినట్టు నేను మండిపడతానని అనుకున్నది కాబోలు. నిన్న తన ఊలు తీసికొని గంటసేపు ఏడ్పించినందు కిది ప్రతీకారం. తానంటే అల్లుకున్న జడకోస పట్టుకుని ఊలుకోసరం నన్నే ప్రార్థించవలసి వచ్చింది. నాకేం! బజారు వెళ్ళి కొనుక్కుంటాను; పేల్చేస్తాను.

ఏమెరుగనట్లుగా కుర్చీలో వచ్చి కూర్చున్నాను మళ్ళీ. కుర్చీచేయిమీద ఓరగాకూర్చొని, నా సాసర్‌లో కాఫీ పోస్తున్నది లీల. నాకు చిలిపిచేష్టలంటే కాస్త సరదా; చెప్పద్దూ: సాసర్ కొంచెం ముక్కపక్కకువంచి, కొంత కాఫీ ఆమె చీరమీద పడేలాగా చేశాను. చీరమీద ఆస్ట్రేలియా పటము లాగా మరకపడింది. నే నేపాపమూ తెలియనివాడనువలె అవతలవైపు కిటికీలోనుంచి చూస్తూ 'మన జామచెట్టుకు ఈ సంవత్సరం కాయలు బాగా కాసినవి సుమా!' అన్నాను. 'ఔను కళ్ళకూ కాసినవి కాయలు. ఏమీ కనుపించదు' అన్నది లీల కోపంతో. ఎఱ్ఱనెండ కాస్తున్నదామె కటాక్ష వీక్షణాల్లో. కండనిప్పులు చిమ్మే పడమటికొండగాలి వీస్తున్న దామె నిట్టూర్పులో.

లీలకు కోపంవచ్చినప్పుడు నా కదో ముద్దుగావుంటుంది. ఆమె సౌందర్యమంతా నేనప్పుడే గ్రహింపగలుగుతాను. ఆ భ్రూకుటినటనా, అధరచలనమూ, ఆ కంటిచూపూ, నన్ను ముగ్ధుణ్ణి చేసివేయగలవు. ఆమె నన్ను తదేకదృష్టితో చూస్తున్నది. నే నామెను చూచీ చూడకుండా తత్సౌందర్యమంతా త్రాగేస్తున్నాను.

కాఫీ త్రాగటం ముగించి, పెరటిలో ఏవో మొక్కలు నాటుతూన్న మా నౌకరు వెధవను పిల్చి, 'సిగరెట్టుపెట్టె ఓటి

తీసికొనిరారా' అని చిల్లరడబ్బులిచ్చి పంపించాను. లీల కుర్చీచేయిమీదనుంచి లేచి ఏమో అస్పష్టముగా గొణుగు కుంటూ చీరమీద కాఫీ తుడిచేసికుంటున్నది. నేనన్నాను 'అదేమిటి చీరమీదకూడా పోసేసుకున్నావు కాఫీ. అయినా, ఈ మరక చంద్రుడికి కళంకంలాగా చీరకు వన్నె తెస్తున్నాదిలే.'

'చాల్లెండి కవిత్వం' అని చురచురా లోనికి పోయింది-వంట చెయ్యాలిగా.

భోజనంచేసి కూర్చున్నాను మా గదిలో క్రింద చాప మీద పరచివున్న పరుపుమీద. పొద్దుననగా సిగరెట్లు కొని తెమ్మని నేను పంపిన కుఱ్ఱవా డింతవరకూ రాలేదు. ఇక నే నన్నాపోయి కొని తెచ్చుకోవాలి. ఆరోజున ఎండ అతి తీవ్రంగా కాస్తున్నది బైట. ఎలాగా అని ఆలోచిస్తున్నా. భోజనాత్పరం సిగరెట్ పీల్చకపోతే హాయిగా వుండదు.

'ఇంతవరకూ ఎందుకురాలేదబ్బా వాడు? నే నిచ్చిన చిల్లర డబ్బులు నాలుగూ తన స్వంతఖర్చుల కుపయోగ పరుచుకోలేదుగదా! ఇంట్లో భార్యకుమల్లేనే నౌకరు కుంక కూడా అల్లాంటివాడే ఐతే, ఇక చెప్పాలి! కాని వా డల్లాంటి వాడుకాడు. ఇన్నాళ్ళనుంచీ చాలా నమ్మకంగా పనిచేస్తు న్నాడు. ఆనక వచ్చినప్పుడు నాలుగు చీవాట్లు తగిలిస్తాను. ప్రస్తుతం మా ఆవిడదగ్గరనుంచే లాగాలి ఎలాగైనా తాను దాచిన పేకట్టు' ఇదే నాలో రేగిన ఆలోచనా పరంపర.

కిటికీలోనుంచి వస్తున్న వెచ్చనిగాలికి గోడకు తగిలించి వున్న 'క్యాలెండరు' కాగితాలు అల్లరిచేస్తున్నవి. ఏవో రెండుసాలీళ్ళు అక్కడ 'ఫోటో' చాటుకుపోయినై. అంతా

నిశ్శబ్దంగా వున్నది; కాని లీల భోజనంకూడా అయిందని కాబోలు, అన్నీ సర్దుతున్న దేమో, చెంబూ తప్పేలాల చప్పుడు మాత్రం వినుపిస్తున్నది.

చేతులు తుడుచుకుంటూ వచ్చి కూర్చున్నది నా దగ్గిరే. పొద్దుటి కోపమంతా ఈ లోపుగానే పోయిందిగా! భార్యాభర్తలకోపం ఎంతసేపుంటుంది!

ఆమె తమలపాకులు మడుపులు చుట్టి ఇస్తుంటే నములుతున్నాను చాలనకుండా. నేను నములుతున్నకొద్దీ ఆమె ఇస్తూనేవున్నది. చివరకు విసుగెత్తి అన్నది 'ఈ కట్టాకులూ మీరే నమలేలాగున్నారే!' అని.

'పోనీ, మానేయమంటే తమలపాకులు వేసుకోనడం మానేస్తానులే. వాటికయ్యే ఖర్చు చీరలకు పెట్టుదువుగాని' అన్నాను.

'అబ్బ! చమత్కారం! ఏం మానక్కరలేదు లెండి!'

'ఏమీ, ఎందుకని? అవి లేకుంటే నీకు సాగదు కనుకనా? అల్లాగే అనుకోరాదూ ఇతరుల సంగతేకూడా. పో, తీసుకోనిరా నీవు దాచిన సిగరెట్ ప్యాకెట్.'

'ఔనుకానండీ! నిన్న మీరు తెచ్చిన సైకిలెక్కడిది?'

'ఒక స్నేహితుడిది. ఎందుకు నీకు?'

'మరేమీ లేదు. మీకు తొక్కడం వచ్చీకూడా సైకిల్ లేక పోవడము'——

'మర్యాదహీనంగా వున్నదా? నీవు చీరలు కొనడం మానేస్తే, ఎప్పుడో ఏలుచూచుకొని ఒకటి కొనుక్కుంటాను మరి!'

‘అదికాదు. వచ్చే సంక్రాంతి పండక్కి మా వాళ్ళింటికి వెళ్ళి మీకు సైకిలు తెప్పిస్తాను. లేకపోతే వాని సమ్మ త్తైనా సరే. అదీ మీరీ ఆటలో గెలిస్తేనే’ అంటూ అక్కడ మూలగా టీపాయిమీదవున్న చతురంగపుబల్లా, కాయలపెట్టీనూ అందుకున్నది.

‘నీవే గెలిస్తే నే నేమన్నా చీరలు గిరలు కొనిపించు కోవాలా?’

‘పందేనికి పందెం లేకపోతే ఎలా?’

నాకు చతురంగపాట అంటే సరదా. ఆ ఆట ఆడు తున్నప్పుడు నాకు బాహ్యస్మృతి వుండదు. నిజంగా తన్మయు డ్నైపోతాను. కాని మా లీలతో ఆడుతున్నప్పుడల్లా ఓడి పోతూనే వుంటాను. ఆమె అద్భుతమైన తెలివితేటలు చూపి స్తుంది ఎత్తులు వేయడంలో. ‘పూర్వం రణరంగంలో చతురంగ బలాలు నడిపిన వీరవనితల రక్తం నీలోకూడా కొంత ప్రవ హిస్తున్నది లీలా!’ అని నవ్వుతూ అంటుంటాను అప్పుడప్పుడు. ‘ఆ తేజస్సు తగ్గిపోవడానికి మగవాళ్లు మీరే కదా కారణం’ అంటూంటుంది తాను.

అలాగా పందెం చరచి ఆట మొదలెట్టేము. ఎలా గైనా సైకిల్ కొట్టాలని తీవ్రంగా బుర్రవంచి ఆడుతున్నాను. సిగరెట్టుమాటమాత్రం మరచిపోయాను; చెప్పవద్దూ. మూడు గంట లాడేము ఆవిధంగా. సిగరెట్ మీద మాత్రం ధ్యాస పోలేదంటే నమ్మండి. అబద్ధం చెప్పటానికి నాకు మించిపోయిం దేమీ లేదు.

ఆట మొదలెట్టినప్పుడు ఆమె పొడుగాటిజడ కుడి భుజముమీదుగా జారి బల్లమీద పడింది. నారాజు అదర్శి

కొన్నప్పట్నుంచి. 'మొందటే అపశకునమా. మీరు ఓడిపోవడమే నిజ' మన్నది లీల. చివరకాదాం అన్నట్టే అయింది. నేనే ఓడి పోయానని చెప్పకోవడం సిగ్గుగానే వున్నది. ఏలాగో ఆడి ఓడటం మీది ప్రథమంగా మగనుక అభిమానపడలేదు. ఎప్పటి మాదిరి నవ్వుతూనే ఉన్నాను.

'ఇంతకూ మీరు సైకిల్ ప్రాప్తిలేనట్లున్నది' అన్నది లీల నాచూపుల్లో ఆమె చూపులు మిళితంచేస్తూ.

'అయితే సంక్రాంతికి పుట్టింటికిపోయే ప్రాప్తి నీకు లేదన్నమాట' అన్నాను పెదవులమీద ఒక గమ్మత్తునవ్వు వెలిగిస్తూ.

ఇంతట్లో బైట 'అయ్యా' అని ఎవరిదో పిలుపు. బయటకువచ్చిచూస్తే అత నొక చీరలవర్తకుడు.

'సరిగ్గా సమయానికి వచ్చాడులెండి' అంటున్నది లీల నా వెనకాల నిల్చుని. వర్తకుడు 'అయ్యా! నిన్న సాయం కాలం అమ్మగా రొకచీర తీసికొన్నారు; అప్పుడు మీరింట్లో లేనందున మళ్ళీ రమ్మన్నారు. ఇప్పుడు వచ్చా' నన్నాడు.

వెనక్కుతిరిగి మా ఆవిడవైపు చూచాను. కొంటె తనమంతా వ్యక్తీభూతమౌతున్న దామె ముఖంలో. నన్ను తృణీకరిస్తున్నట్లు నవ్వుతూన్న తన పెదవులమీద చీరకొంగు అడ్డంపెట్టుకుని నాముఖం చూడలేకనో ఏమో చూపులు త్రిప్పకుని, ముఖం వంచి కట్టుకున్న చీరచూచుకుంటూ 'ఇదే చీర' అన్నది.

అదేనేను ప్రొద్దున కాఫీపోసిన గళ్ళడి. నిన్న తాను కొని ఇవ్వాళ నాచేత డబ్బులిప్పిస్తున్నది. ఇదొక కొత్తఎత్తు.

ఇదివరకల్లా ఎక్కడన్నా పైకముంటే తానే తీసికొని నాకు చెప్పకుండా చీరలు కొనుక్కుంటేది. అలా కాకుండా ఇవాళ విధంగా నాచేతనే కొనిపించడం. నాకు మండిపోయింది ఒళ్ళు. ఆ మెదృష్టిలో నేనొక విలువలేనివాడనై నానుగదా అనే భావనొకటి నన్ను కలవరపెట్టింది. అప్పటి నా పుద్రేకమంతా చెప్పలేను గాని నాముఖఫలకంలో ప్రతిఫలించింది. అది గ్రహించలేకపోలేదు లీల.

నేనేమీ మాట్లాడలేదు. వస్త్రకుడికి వచ్చిచ్చి సంపకి తప్పడు. వా డడిగినంతా ఇచ్చాను. ఒకసారి కట్టుకున్నదీ, కాఫీమరక పడ్డదీ, మళ్ళీ వాడికి వాపసు చేయడ మెలాగా? అలా చేస్తానని కాబోలు మొదలే జాగ్రత్త పడింది లీల.

వస్త్రకుడు వెళ్ళిపోయిన తరువాత నాస్నేహితుడొకడు వస్తే వాడితో కొన్ని అవసరకార్యాలనుగూర్చి మాట్లాడుతూ డాబామీద కూర్చున్నాం. చివరకతడు వెళ్ళిపోయేటప్పటికి తాలూకాకచ్చేరిలో కొట్టినగంటలు అయిదు వినిపించినవి.

డాబామీదనుంచి తిన్నగా మెట్లుదిగివస్తూ ఆనాడు చదువేమీ సాగలేదుకదా అని ఆలోచించుకున్నాను. ఒక్కసారి నాటిచర్య అంతా మనస్సులో పరువెత్తింది. చతురంగ పాటమూలాన్న, నాస్నేహితుడు వచ్చినందున అంతవరకూ అణగివున్న సిగరెట్‌మీద కాంక్ష — కుతి అంటేబాగుంటుం దేమో — తలెత్తింది.

మెట్లుదిగి దక్షిణపుగది గుమ్మందాకా వచ్చాను. అది మనోహరసందర్శనము, సౌందర్యదేవతాప్రత్యక్షము. హాలులో పెరటివైపు కిటికీముందు అద్దంచూచుకుంటూ జడలో పూవులు పెట్టుకుంటున్నది లీల.

నన్ను చూడగానే నావైపు నడచివస్తూ 'ఇందాక మీకు కోపంవచ్చినట్లున్నది. మీ మనస్సు నొప్పించిన దాన్నైతే క్షమించండి. ఇకనుంచి నాకు నేనెన్నడూ చీరలు కొనను. మీరు కొన్నవే పుచ్చుకుంటాను. క్షమించారా?' అన్నది నాముఖభావాలు పరీక్షిస్తూ. నేను ప్రసన్నత్వమే కనబరచేను.

ఇక్కడ నాభార్యలోవున్న ఉత్తమగుణం ఓటి సూచిస్తాను. నాకు కోపంవచ్చినప్పు డెప్పుడూ ఆమెకూడా కోపం తెచ్చుకొని రసాభాసంచేయదు. తానే కొంచెముతగ్గి అనునయవాక్యాలు పల్కటం ఆమెకు అభిమానకరము కాదు. అందుకనే నాజీవిత మొక నందనవనం. అందులో నాలీల సౌందర్యకుసుమం.

నిమిషమాత్రం మేముద్దరమూ మాట్లాడ లేదు. అప్పుడే మా యిద్దరి ఆత్మలూ, ఒకటి నొకటి మన్నించు కున్నవి.

చివరకు లీల తన వేళ్ళతో నాగుండీలు తిప్పుతూ, 'ఇవ్వాళ సినీమాకు తీసుకొనివెళ్ళరూ!' అంది.

'నన్నుమాత్రం ఈ రోజుల్లా సిగరెట్టు తాగనిచ్చేవు కావు కదా లీలా' అన్నా ఆమె బుగ్గ మెల్లిగా తట్టుతూ.

'ఐతే ఉండండి,' అంటూ లోనికిపోయి రెండుసిగరెట్ ప్యాకెట్లతో ప్రత్యక్షమైంది. నే నాశ్చర్యపోయాను.

'అలా చూస్తారేం, రెండో దెక్కడిదనా! నాకసు వాడిని తెమ్మన్నానుకదూ ఒకటి. అదే ఇది. ఇది ప్రొద్దున నేను దాచింది.'

'నువ్వేలాగు తీసికున్నావు వాడిదగ్గరనుంచి?'

'వాడు ప్యాకెట్ తీసుకొని వీధిగుమ్మందాకా రాగానే నేనందుకుని ఇవ్వాళిల్లా మనింటి చాయలే రావద్దని చెప్పి పంపేను.'

'నీ కిల్లాంటి తెలివితేట లున్నందుచేతనే, లీలా! నే నానందమయుణ్ణి—మరి వంటచేశావా! సినిమాకు మొదటి ఆటకే పోదాం పోతే.'

'వంటెంతసేపు; నిముషం. మీరుకూడా రండి కూర్చుం దురుగాని' అంటూ కుర్చీ తీసికెళ్ళి వంటింట్లో వేసింది.

కుర్చీలో కూర్చొని సిగరెట్లు పీల్చడం మొదలెట్టేను, మా ఆవిడ కుంపటిరాజేస్తుంటే. ప్రొద్దుటినుంచి లేనందున సిగరెట్లు చాల రుచిగావున్నాయి. ఒకదానికోసం మొదట కొంత ఆర్తి అనుభవిస్తేనేగాని తరువాత తదనుభవ మానంద మయంగా వుండదు.

రాత్రి సినిమాకు వెళ్ళేము. అందుమూలాన్న రాత్రి కూడా చదువులేదు. తక్కిన విద్యార్థులంతా అన్నం నీళ్ళు మానేసి రాత్రింబవళ్ళు ఒకటే చదువు చదువుతూంటే నేను నా లీలతో కులసాగా కాలక్షేపం చేస్తున్నాను. ఇక నే నెలా గబ్బా వచ్చేపరీక్షలోనైనా నెగ్గ గలిగేది!

# ఆ వృద్ధ పత్ని

౧

మా ఆవిడ కొక అమ్మమ్మ వున్నది; అంటే నాకూ అమ్మమ్మే [illegible]. ఆమె ముసలితనంలో అడుగుపెట్టిం దనవలసిన దే. కాని పని పాటా చక్కగా విసుగుకోకుండా శ్రద్ధగా చేస్తుంది. పూర్వకాలపు వాళ్ళకుండే లక్షణా లామెవద్ద కనుపించవు. ఆమె నవ్వుతావుంటే నవ్వే మంగిస్తున్నగా వుంటుంది, చేతులు కొంచెం బొద్దుగా వుంటువి. కొత్తగా చూసేవాళ్ళ కామె ముఖం చాలా గంభీరంగా వుంటుంది. ఏ రాజ్యానికో మంత్రి అయితే ఈవిడ భూచక్రం గిరగిరా చిటికెనవేలి కొనను మీద తిప్పివేయగలదురా అని అభిప్రాయపడతారు ఆమెను ఎఱిగినవాళ్ళు. ఆమె యెప్పుడూ తెల్లని మల్లుపంచలు కట్టుకుంటుంది. రాత్రి భోజనం చేయదు. ఆవిరితో ఉడికించిన మినుపపిష్టం బెల్లంతో కలిపి తింటుంది. ప్రతి యేకాదశీ వుపోష్యం వుంటుంది; కాఫీమాత్రం పుచ్చుకుంటుంది.

ఆమె, తన భర్త బ్రతికియున్నంత కాలమూ, పిఠాపురంలో వెలిగించింది కాపురం. భర్త మరణానంతరం ఆమె కొడుకులు నైజాంరాష్ట్రంపోయి అక్కడ ఉద్యోగాలు సంపాదించుకుని జీవిస్తున్నారు. వాళ్ళదగ్గరే వుంటూవుంటుంది ఈమె కూడా. కాని కోడళ్ళతో పడకనో, కొడుకులను సాధించడానికో, మరి యేకారణమో మనకు తెలియదుకాని అప్పుడప్పుడు నెల్లూరులోవున్న మా మామయ్యగారింటికి వస్తూ

వుంటుంది. మా మామయ్యగారి భార్య, అనగా మా అత్త గారు, ఆమె కూతురేగా!

ఆమె రావడంతోనే ఇక మా అత్తగారికి వొళ్ళు తెలీదు. ఆ సంతోషపారవశ్యంలో మొగుడూ మరెవ్వరూ ఆమెకు కనుపించరు. ఆ ముసలమ్మ దగ్గర ఎంత ఆకర్షణశక్తి యున్నదో నాకు తెలీదు.

వెంటనే ఆ తల్లీ, కూతురూ కలసి మా మామగారిల్లు కేంద్రస్థానంగా ఏర్పరచుకుని, చుట్టుపట్లవున్న దగ్గిర బంధువులకు— స్త్రీబంధువులకు మాత్రమే— వుత్తరాలు బనాయిస్తారు. ముసలమ్మ నైజాంనుంచి చాలాకాలంగా మనదేశం వచ్చింది కనుక వెంటనే బయలుదేరి రమ్మని. ప్రథమాహ్వానం రామచంద్రపురంలో కాపురంచేస్తున్న ముసలమ్మగారి రెండో కూతురికి. ఆవిడ ఈ ఆహ్వానపత్రం చూచుకున్న తక్షణమే ఆరునెలల కడుపుతో వచ్చి వాలుతుంది నెల్లాపులో. ఆమె బాగా పాడుతుంది అంటారు. ఆమె వచ్చేటప్పుడు హార్మోనియంపెట్టె తెచ్చుట మరచిపోదు. గంపెడుసంతానం ఆమెతో కూడ వస్తుంది. ఏటా ఒక బిడ్డను కంటుంది ఆమె—ఇక రెండో ఆహ్వానం నాభార్యకని వేరుగా చెప్పనక్కరలేదు.

ఈ విధంగా నలుగురూ వచ్చి చేరుతారు మా మామగారింట్లో. ఇంకేం, మా మామగారికి దశ ఎత్తుకున్న దన్నమాట; గ్రహాలన్నీ కేంద్రస్థానంలో చేరుకున్నవి.

వీళ్ళంతా కలసి ఏమిచేస్తారో చెప్పనా! గంటగంటకూ కాఫీ చేసికొని తాగటం, ఫలహారాలు చేసికొని తినటం, లేకపోతే వూళ్ళో స్త్రీ జనాన్ని పిలిచి మీాటింగులుచేయటం. ఆ

మీటింగులలో రామచంద్రపురంనుంచి వచ్చిన గర్భిణి హార్మోనియంమీద పాటలుపాడి వినిపిస్తుంది; లేదా, ముస లావిడ తన వంశప్రాశస్త్యము గురించి, తన జనకుడు పూర్వం పెద్ద వుద్యోగం చేసి ఇప్పుడు నూరురూపాయల 'పెన్షను' పుచ్చుకుంటున్నాడనీ, తనకొడుకులు చాల ప్రయోజకులనీ, చిన్నచిన్న వుపన్యాసాలుచెప్పి సభను రంజింపజేస్తుంది.

ఇంత హడావుడీ యింట్లో జరుగుతూంటే మా మామ గారు కచేరికిపోయి కూర్చుంటాడు. అక్కడ తనతోడి వుద్యోగస్థులతో, బంధువులమూలాన్న తనకు చాలా డబ్బు ఖర్చౌతున్నదనీ, వచ్చినవాళ్ళు తనింట్లో రెండు మూడు నెలలు తిష్ఠవేసి, పురుడూ, పుణ్యాలన్నీ వెళ్ళతీసుకొని పోతుంటారనీ, అందుమూలాన్న వచ్చే జీతం తనకు చాలటము లేదనీ చెప్పుకుంటాడు! ఇంట్లోమాత్రం ఆ మాట అనడు మానవుడు. అన్నాడా తన భార్య కోపదృష్టి సహింపగలడా?

'ఏమయ్యా మీ మామగారి గుట్టంతా బయట పెట్టుతున్నావే' అని అంటారేమో. పరవాలేదు. మా మామగారికి కోపం వస్తుందని నాకు భయంలేదు. ఆయనకు లోపల కల్మషమున్నా పైకి చిరునవ్వే నవ్వుతాడు. అంతగా మానాభిమానాలు లెక్కచేసేవాడుకూడా కాదు. ఇక మా అత్తగారిమాట! ఆవిడకుమాత్రం కోపం ఎందుకు? ఆమె భర్తను ఆజ్ఞాపించి నౌకరులా వుపయోగించుకుంటుందని ఆమె ఆధిక్యతనేగా వుగ్గడించాను?

కథ సాగిస్తాను. మళ్ళీ ఈ మధ్య ఆ ముసలమ్మ నెల్లూరు విజయం చేసిందట. అప్పుడే నా భార్యకు కబురు తెలిసింది.

ఆహ్వానంకూడా వచ్చినట్లే వున్నది. లీల చెప్పకపోయినా నేను ఊహిస్తున్నాను.

౨

సంవత్సరాది పండుగ పదిరోజులున్నది. ఎందువల్లనో ఆనాడు పడక్కుర్చీలో నిరుత్సాహంగా పడుకున్నాను. నే నేమో ఆలోచిస్తున్నాననికూడ చెప్పలేను; మందంగావున్నది మనస్సు. ఆ పక్క ఎంతసేపటినుంచీ అలా వచ్చి నిల్చుని వున్నదో లీల, నాకు తెలియనే తెలియదు.

'ఏమండీ! ఎన్నిసార్లు పిల్చినా పలకరూ! కళ్ళు తెరచుకొనే నిద్రపోతున్నారులావుంది' అని లీల కొంచెం హెచ్చు స్వరాన అనేసరికి మళ్ళీ ప్రపంచంలోకి వచ్చా.

'ఆ! ఏమిటి విశేషాలు'

'నేను పత్రికా సంపాదకురాలను కాదుసుమండీ!'

'మరి ఇన్స్యూరెన్సు కంపెనీ ఏజెంటువా? వాళ్ళు పట్టుకుంటే వదలని......'

'మీా వన్నీ వేషాలు. ఇలా చూడండీ!'

'ఓహో! నీవా? ఎందుకొచ్చావు. లీలా!'

'ఏం రాకూడదా!'

'ఊరికే రావులే.'

'మరెందుకొచ్చాను?'

'నాకు తెలుసు.'

'తెలిస్తే చెప్పండి'

'చెప్పను.'

'మీ కెప్పుడూ నవ్వులాటే— సరేకానండి; నెల్లూరుకు వచ్చిందట మా అమ్మమ్మ.'

'అలాగా! వెళ్ళబెట్టవేం మరి! వచ్చిందీ పొడుగు మెడావిడ!'

'ఆవిడ కెందుకులెండి చక్కదనం; ముసలావిడకు'

'మరి నీకు కావాలా వయసావిడకు?'

'అబ్బ! ఇలా ఎగతాళిసాగిస్తే నేను పోతానండీ'

'ఆ! పోవద్దులే; కూర్చో కుర్చీచేయిమీద— మరి రామచంద్రపురంనుంచి వచ్చిందా మీ పిన్నికూడా?'

'వచ్చిందిట.'

'ఎన్నో నెలట?'

'ఆరు'

'హార్మోనియం పెట్టెకూడా తెచ్చిందటనా?'

'మళ్ళీ మొదలు పరాచకం. ఆవిడపాట మీకు బాగుండకపోతే సరిపోయింది కాబోలు.'

'ఎవరన్నారూ బాగా పాడదనీ?'

'మీకు మావాళ్లంటే అంత ఎగతాళి. అల్లుడితనం పోనిచ్చారూ! 'అల్లుని మంచితనంబును' అని సుమతీ శతకంలో....'

'ఆపద్యం హార్మోనియంమీద వాయించటము నేర్చుకో మీ పిన్నిదగ్గర.'

'అబ్బ! నేను పోతానండీ; మీ హాస్యానికి మితిలేదు.'

'పోతా, పోతానని బెదరిస్తావెందుకూ? నెల్లూరు ప్రయాణానికి సెలవు అడగకుండానే ఇక్కడనుంచి పోవని నాకు తెలుసు.'

నీల కొద్దిగా నవ్వుతూ నేనింకా ఏమో చెప్పుతానని ఎదురుచూస్తున్నది. నేనన్నాను, 'అలా వెళ్ళటానికి వీల్లేదండీ! పోయిన సంక్రాంతికి నీవుచేసిన మోసం నేను మరచిపోలేదు. 'పండుగ నెలరోజు లున్నదీ, మళ్ళీపోవచ్చును. వారం రోజుల్లో రమ్మ'నికదా! చెప్పి మీ నాన్న వెంట పంపించాను. నా మాట నిర్లక్ష్యం చేసి అక్కడే పండుగకూడా వెళ్ళదీసికొని, నెలరోజుల వరకూ రాకపోయావు. నీ ఆ మోసం నామనస్సులో వున్నంత వరకూ మళ్ళీ నీవు పుట్టింటికి పోవటానికి నా ఒప్పుదల లేదు.'

'ఆడవాళ్ళను పుట్టింటికి పంపడమంటే ఎందుకో మొగాళ్ళ కంత కష్ట మనిపిస్తుంది?'

'నా విషయంలో చెప్పేనుగా కారణం.'

'మరి రాక రాక పుట్టింటికి వచ్చిన ఆడపడుచులను వెంటనే పంపిస్తారా చెప్పండి!'

'నీవువస్తే వాళ్ళు అడ్డగిస్తారా ఆలోచించండి'

'పోనీ, ఆ ఒక్కతప్పూ క్షమించేయకూడదూ. ఈ సారి ఎక్కువరోజులుండను. ఇంకా పదిరోజులకు కదా ఉగాది పండుగ. పదకొండోనాడల్లా ఇక్కడ హాజరౌతాను.'

'ఇల్లా చెప్పి వెళ్ళినదానవే అప్పుడుకూడా.' అంటూ కుర్చీలోనుంచి లేచి టెన్నిసుబ్యాటు పుచ్చుకొని చెప్పులు తొడుక్కుంటున్నాను.

'అప్పుడే క్లబ్బుకు వేళకాలేదు. కాస్త ఫలహారంచేసి వెళ్ళండి' అన్నది లీల.

నేను మౌనంతో గడపడానికేను. 'ఏం చెప్పేరు చివ రకూ' అని అడిగింది లీల గుమ్మందాకావచ్చి. నేను మాట్లా డకుండా వెళ్ళిపోయాను.

మళ్ళీ సాయంత్రం చీకటిపడిన తరువాత నేను క్లబ్బు నుంచి ఇంటికి చేరుకున్నాను. లీల వంటపనిలో వున్నది. నేను హాల్లో దీపంముందు తీరిగ్గా కూర్చుని కూనిరాగాలు తీస్తు న్నాను. ఇంతలో మా మామగారి స్థూలశరీరం గుమ్మందగ్గర ప్రత్యక్షమైంది. ఆయన మా యింటికి ఎప్పుడువచ్చినా సాయంత్రంపూటే వస్తాడు. మళ్ళీ తెల్లవారగానే వెళ్ళిపో వచ్చుగదా అని.

మా ఆవిడ తెచ్చియిచ్చిన నీళ్లతో కాళ్లూచేతులూ కడిగికొని లోపలకు వచ్చాడు. వచ్చి హాల్లోవున్న బల్లమీద నేనువాల్చాడు. ఆ కొసనున్న పరుపుచుట్టమీద తలవుంచి ఒత్తిగిలి పడుకున్నాడు. నల్లనిరూపం; పొట్టిశరీరం. అప్పటి ఆయన్ని చూస్తే సాక్షాత్తు శేషశాయి జ్ఞాపకంవస్తాడు. ఆయనచుట్టూ ఎవరన్నా నలుగురు కిన్నెరసానులు నాట్యం చేస్తూ పాడుతూవుంటే బాగుండునురా! అనుకున్నాను. ఆయన మంచి రసికుడు. వయః ప్రాభవంలో ఆయన వార కాంతాలోలుడని వదంతి.

మేము క్షేమసమాచారాలు మాట్లాడుకుంటున్నాము. ఇంతలో మా పై యధికారి నౌకరు వచ్చాడు. 'అయ్యా! అయ్యగోరు రమ్మంటున్నరయ్యా! మిమ్మల్ని' అన్నాడు నన్ను చూచి.

వాడికి పుట్టెడుచెవుడు. 'వస్తున్నానని చెప్పరా, పో' అని బిగ్గరగా వాడిచెవిలో చెప్పేను. 'సరిలెండి! సరిలెండయ్యా!' అని పోబోతూ వాడు మా మామగారినిచూచి 'వారోరయ్యా! వారోరు' అని అడిగేడు.

'ఎవరైతేనేం పోరా,' అంది లీల.

'షావుకోర్లా! షావుకోర్లా!' అని అన్నాడువాడు.

'కాదు మా మామగార్రా' అన్నాను నేను వచ్చేనవ్వు ఆపుకుంటూ.

'బాకీకోసం వచ్చిన్రా! షావుకోర్లకు బాకీవుంటే కష్టం బాబయ్యా! ఇంటికొచ్చి పండుకుంటరు' అంటూ వాడు వెళ్ళిపోయాడు. లీల విరగబడి నవ్వుతున్నది. వాళ్ళ నాన్న చిన్నపోతాడనన్నా అనుకోకుండా. నా నవ్వును బలవంతంగా అరికట్టేశాను. మా మామగారు ఇంచుమించుగా షేరీకోమటిలాగే వుంటాడు చెప్పొద్దూ.

మా మామగారిప్పుడా ఒంటెమెడావిడచేత ప్రోత్సహించబడి లీలను తీసికొని పోవచ్చాడని నేనూహించక పోలేదు. ఆసంగతి భోజనాలైన తర్వాత చుట్ట కాల్చుకుంటూ వెళ్ళబెట్టేడాయన. నేను కొంచెం ఆలోచించినట్లు నటించి, ఇంకా నాలుగైదురోజులలో మా ఆఫీసుకు సెలవులిస్తారనీ, అప్పుడు లీలా, నేనూ, బయలుదేరి వస్తామనీ, నాకుకూడా ముసలమ్మను చూడాలని చాలావుందనీ ఒక చిన్న వుపన్యాసపూర్వకంగా చెప్పి ఆయనచేత 'సరే' అనిపించాను.

ఇంతలో లీల అందుకున్నది. అన్నీ దొంగమాటలే నాన్నా! ఇందాక నన్ను నెల్లూరు పంపనంటే పంపనన్నాడు.

'ఛీ! పెద్దమనుష్యులతో కూడా దొంగమాటలేనా!' అన్నాను.

'అయితే తప్పకుండా వస్తారా మీరుకూడా?'

'చెప్పేను కాదూ.'

'అయితే, నాన్నా! ఇద్దరమూ కలసివస్తాములే వారి ఆఫీసుకు సెలవులిచ్చాక.'

'మీ అమ్మమ్మ నీకోసం ఎదురుచూస్తున్నదమ్మా!'

'ఇంతలోకే ఆమెకండ్లు కాయలు కాయవులెండి' అంటూ నేను మా పై యధికారియింటికి పోయాను. మర్నాడు పొద్దున్నే, మా మామగారు ఒక్కడే వెళ్లిపోయాడు.

## 3

రేపే సంవత్సరాదిపండుగ. ఇన్నాళ్ళనుంచీ అమ్మమ్మ కోసం కలవరిస్తూనేవున్నది లీల. నే నేవోమాటలుచెప్పి ఇంత వరకూ ప్రయాణం సాగకుండా చేశాను.

మా మామగారు వచ్చిననాటిరాత్రి నా పై అధికారి నన్ను ఊరికే పిలువలేదు. నాకొకపని నియమించాడు. ఆయన ఆజ్ఞానుసారంగా నేను సంవత్సరాది పండుగనాడు సరిగ్గా మద్రాసులో ఉండి కొన్నిపనులు చక్కబెట్టుకోవలసి ఉన్నది.

రేపు పండుగ; నేను మద్రాసు వెళ్ళకతప్పదు. లీల నెల్లూరుపోవాలని పట్టుపట్టింది. సరే, 'ఆ రాత్రిమెయిల్' కు బయలుదేరేము. నేను రెండుటిక్కట్లు మద్రాసుకు కొని

జేబులో పెట్టుకున్నాను. ఇద్దరమూ ఇంటరుక్లాసు బండిలో కూర్చున్నాము. బండిసాగింది.

తెనాలి'స్టేషన్'లో మాపెట్టెలో జనమంతా దిగిపోయారు. మేమిద్దరమే ఆపెట్టెలో మిగిలింది. ఇందాకటినుంచీ కునికిపాట్లు తీస్తున్న లీలకు ఇప్పుడు సందుదొరకగానే శుభ్రంగా ఆ 'కుషన్‌సీటు'మీద శరీరం వాల్చింది. 'మీకూ నిద్రవస్తే నన్ను లేపండిసుమా! ఇద్దరమూ కన్నుమూస్తే నెల్లూరుస్టేషన్ దాటి మద్రాసు వరకూ పోగలము' అని నాకు హెచ్చరిక చెప్పి తాను నిశ్చింతగా నిద్రపోయింది.

నే నేదో ఒకనవల చదువుకుంటున్నా. రైలుబండి చాలా వేగంగానే పోతున్నది. కొన్ని 'స్టేషన్ల'లో ఆగుతున్నది. కొన్ని 'స్టేషన్లలో' ఆగటములేదు.

ఆ నవల చదివి చదివి విసుగెత్తింది. ఒక్కసారి ఒళ్ళు విరిచి, ఆవలించి, తెచ్చుకున్న 'థర్మోఫ్లాస్కు' లో కాఫీ అంతా త్రాగేశాను. అప్పుడు నా చేతిగడియారంలో 'టైము' చూస్తే రెండుగంటలైంది. ఆ అమావాస్య చీకటిలో బండి కిటికీలోంచి అవతలకు చూస్తే నాకంతా నల్లగా కనుపిస్తున్నది. బండిదగ్గరనుంచి భూమిమీద రెండుగజాల మేరవరకు మాత్రం లోపలవున్న దీపాలకాంతి కనుపిస్తున్నది. కొంచెము చలిగాలి వీస్తున్నది బండిలోకి. గంభీరమైన ఆ నిశాసమయంలో బుసలుకొట్టుతూ పోయే త్రాచుపాములాగా రైలు బండి పరుగిడుతూంది.

నాకూ నిద్రవస్తున్నది. 'సూటుకేసు' మీద తలవాల్చి అలా కన్నుమూసి నిద్రపోయాను. నెల్లూరుస్టేషను దాటిపోతామేమో నన్న భయం నాకులేదు.

ఆ నిద్రలో ఒక కల. స్వప్నరంగము మద్రాసు ప్లాటుఫారంమీద. నేనూ లీలా కలిసి వెళ్ళుతూంటే ఆ ముసలమ్మ ప్రత్యక్షమైంది. ఆవిడ కెవరో మద్రాసులో 'కూము'నది చాల పుణ్యనది అని చెప్పితే సంవత్సరాదినాడు అందులో స్నానంచేసి కాస్తపుణ్యం మూటగట్టుకుపోదామని వచ్చిందట. ముక్కుపట్టుకుని ఆనదిలో స్నానంచేసి కొంచెం విభూతి—ఇంటివద్దనుంచి మూటగట్టి తెచ్చుకున్నది ఫాలభాగాన ధారణచేసి మా కెదురైంది. మమ్మల్ని సమీపించి అమాంతంగా లీలను కౌగలించుకుని ఏడ్చింది. చివరకు కన్నీళ్లు తుడుచుకొని ఒక మిఠాయిపొట్లం తీసి ఇచ్చింది. లీల దాన్ని విప్పి కొంత మిఠాయితీసి నాకీయవచ్చింది. నూనెకంపు వస్తూంటే నాకొద్దన్నాను. నేను స్వీకరించకపోతే తన్న అమమ్మ కవమాన కరంగా వుంటుందని భావించేదేమో, బలవంతంగా నానోట్లో పెట్టవచ్చింది. నేనసహ్యించుకుంటూ దానిచేయి తోసేశాను—తోయడంలో నాతల కింది పెట్టె కిందపడి పెద్ద మోతైంది. దానితో నా నిద్ర భంగమైంది. లీలకూడా లేచింది. రైలు పొన్నేరిస్టేషన్లో ఆగివుంది.

ఇప్పుడు లీలకు గాభరా ఎక్కువైంది, స్టేషను దాటి పోయింది అని. దానికోసం ఇంకో [illegible] వున్నది. ఎవరైనా టిక్కెట్లు తనిఖీచేసేవాళ్ళు వస్తే జవాబుచెప్పాలేమో అంటే నేను [illegible] వేయవలసి వస్తుందేమోనని. ఏమీ పాలుపోని మనస్సుతో నా తాలూకు [illegible] అనుకుంటూవున్నట్లుగా నిరుత్సాహంగా నా కేసిచూచింది. నా జేబులోవున్న టిక్కెట్లు మద్రాసు వరకూ అని ఆ పిల్లకు తెలియదు.

ఎంత మోసం జేసినా మన దేశంలో పాపం స్త్రీ భర్తే దైవమనుకుని అతన్ని అనుసరించి వుంటుంది. ఎంత తెలివి తక్కువ పెద్దమ్మనుచేసి ఆడిస్తున్నా సిగ్గుతో చిరునవ్వు చూపించి అతన్ని గౌరవిస్తుంది. అప్పటిస్థితిలో లీలనుచూస్తే నాకు జాలి వేసింది. అంత అమాయికత్వాన్ని మోసంచేస్తున్నానని తోచి నప్పుడు నాకాఠిన్యానికి మేరలే దనిపించిందె. లీలంటే నా కెందుకో ఒక విధమైన ప్రేమ. ఆమెలోనుంచి ఒక ఉత్సా హాశక్తి ఎప్పుడూ నాహృదయంలోకి ప్రవహిస్తూంటుంది. ఆమె పలువరుస కొంచెమెత్తుగా వున్నా అది భాగ్య చిహ్నమేనను కున్నాను. తండ్రివలె మితిమీరి నాక కొంచెం బొద్దుగావున్నా తల్లికివలె శరీరచ్ఛాయ ఎరుపే. కన్నులు చేరెడేసు లేవుగాని తేజస్సువున్నది వాటిల్లో. ముత్తముమీద కురూపి కాదు. సౌందర్య రేఖలు ఆమెలో లేకపోలేదు. కాని నా ప్రేమకూ, ఆమె చక్కదనానికీ సంబంధం లేదు. నే నామె నెందుకు ప్రేమిస్తున్నానో నాకే తెలీదు. ప్రేమించడము నా స్వభావమే అయిపోయింది.

బేసిన్ బ్రిడ్జి స్టేషన్‌లో టిక్కెట్లు వసూలు చేసేవాడు రాగానే జేబులోనుంచి రెండు టిక్కెట్లూ తీసి ఇచ్చేశాను. వాడు వాటిని జేబులో వేసుకొని వెళ్లిపోయాడు. అప్పటికి లీల మనస్సు కుదుట పడింది. టిక్కెట్లవాణ్ణి మోసపుచ్చా ననుకుని నా తెలివితేట లుగ్గడించింది'

మద్రాసులో నాపను లేవో చూచుకుని పట్నంలో విశేషాలు కొన్ని లీలకుగూడా చూపిద్దామని సాయంత్రంవేళ "ప్యూపిల్స్ పార్కు"కు తీసుకపోయాను. మొదలు ఒంటెల

శాల చూశాము. మెడ నిక్కించి చూస్తున్న ఒక ఒంటెను చూపించి 'అది చాలా బాగుందండీ' అన్నది లీల. 'ఎరుగవా? అది మీఅమ్మమ్మే' నన్నాను. 'పోదురూ, మీచమత్కారం మీరునూ' అన్నదామె. 'చమత్కారంగానే భావిస్తున్నావా? ఆ మెడచూచి పోల్చుకో వచ్చునే' అంటూ ఆమె చిరునవ్వు కొంత చూరగొన్నాను.

తరువాత ఎలుగుబంటును చూపించి చిన్న ప్రపన్యాసం ఇచ్చాను. 'నల్లగా, స్థూలంగా, ఒంటినిండా బొచ్చుతో వున్న ఈ జంతువును చూస్తే నాకు మీ నాన్న జ్ఞాపకం వస్తాడు. ఆయనకు లంచాలంటే ఎంతప్రీతో ఈ జంతువుకు తేనెపట్టంటే అంత అపేక్ష. తేనెటీగలు కుట్టుతున్నా పట్టువదలడు' అన్నాను. వినీ, విననట్లుగా అలాగే చూస్తూన్నది లీల ఆ జంతువును.

పెద్దపులిని చూచినప్పుడు మాత్రం . మా ఆవిడే కొద్దిగా భయపడింది. 'ఇది చాలా భయంకరమైన మృగం సుమండీ!' అన్నది.

'అవును, మీ అమ్మకు మల్లేనే భర్తమీద కోపం వచ్చినప్పుడీ రూపాన్నే ధరిస్తుంది ఆమెకూడా. మీనాన్నగారామెదృష్టిలో ఏమైనా తప్పుగా నడచుకున్నట్లైతే ఆయన మీద ఆమె ఎలా నోరు చేసికొని అరుస్తుందో అలాగే గర్జిస్తుంది ఈజంతువుకూడా' ఈనామాటలకు కొంచెముగా నవ్వినా, లీలచూపుల్లో కొంచెం కోపంకూడా వ్యక్తమౌతున్నది.

ఇంతలో ఎక్కడనుంచో ఒకస్వరం బయల్దేరింది. 'మీ పిన్ని కాబోలీ చాయల హార్మోనియంమీద గానం చేస్తున్న

ట్లున్నది లీలా!' అన్నాను. ఆమె తల తిప్పి అక్కడ ఓంఁడ పెట్టుతూన్న ఒకగాడిదను చూచింది.

కంగారుమృగాన్ని మాత్రం లీల చాలాసేపుచూసింది. 'ఈజంతువు పేరేమంటారండీ' అని అడిగింది. 'దానిపేరు కంగారు. అది మీచెల్లెలిలాగా చాలా అందంగావుంటుంది' అంటూ నవ్వేను.

మేము తిరిగి వచ్చేటప్పుడు అక్కడ గొలుసులతో కట్టివేయబడియున్న రెండు కోతులు కిచకిచమని అరుస్తూ మా ఆవిడ చీరె కుచ్చెళ్లు పట్టుకునిలాగినై. ఆగాభరాలో ఆమె తనచేతిలో ఇంతదనుకనుంచీ ఒక్కొక్కటి తినగా మిగిలిన జీడిపప్పులు కిందికి జారవిడిచింది. ఆ పప్పులు రెండుచేతులా ఏరుకుని తినడం మొదలెట్టినై కోతులు. 'లీలా! భయపడకు. ఇల్లాంటి కోతిచేష్టలు రోజూ సీతమ్మొదు రాముడు చేస్తూనే వుంటాడు, ఇదికొత్తకాదుగదా.' అంటూ ఆమె భయముడిపి ఇంటికి దారితీశాను. దారిలో లీల మాట్లాడలేదు. తాను చూచినదంతా మళ్లీ మనస్సులో నెమరు వేసుకుంటున్నట్లున్నది. ఇదివర కెన్నడూ పట్నాసు చూచివుండనందున ఆమెకు చాలా వింతగా వున్నవి కొన్ని విషయాలు. ఇంకా పట్నంలో రెండుమూడు రోజు లుండాలని కోరికగాకూడా వుందామెకు.

బసకు చేరుకుని సామానంతా సర్దుకుని, మెయిలుకు వెళ్ళిపోదామనీ' లీలను తొందరచేశాను. 'ఇక్కడ ఇంకా రెండురోజులుండి పోదామండీ' అన్నది.

'ఐతే నెల్లూరులో దిగే ఆలోచన మానుకోవాలి. ఆలస్యమైతే నా వుద్యోగం వూడిపోతుంది.'

'సరే అలాగే ఎకాయెకి వెళ్లిపోదాం ఇంటికి.'

'మరి మీ అమ్మమ్మను చూడక్కర లేదూ! జంతు ప్రదర్శనశాల చూడగానే మీ వాళ్లందర్నీ చూచినట్లుగానే తెలుస్తున్నా వా?'

'మా అమ్మమ్మను మనవూరు రమ్మని వ్రాద్దాము లెండి. ఆమే వచ్చి నాలుగురోజు లుండిపోతుంది' అంటూ గదిలో 'ఎలెక్ట్రిక్ స్విచ్చి' నొక్కింది. ఆ విద్యుద్దీపకాంతిలో శరద్విభావరీ దేవిలాగా నిల్చునివున్నది లీల. అమ్మమ్మకంటే విలువైన విషయాలు మద్రాసులో వున్న విసుమా అనుకుంటూ. నేను 'టిఫిన్ కారియర్' పుచ్చుకుని వూటకూటింటికి భోజనం తెచ్చేనిమిత్తం త్వరత్వరగా వెళ్లిపోయాను.

నాలుగోనాడు సాయంత్రం మళ్లీ మావూరువచ్చేశాం. మా మామగారు వ్రాసిన వుత్తరం ఒకటి మాయింట్లో పడి వుంది. పోష్టుజమాను కిటికీలోగుండా లోపల పడేసి పోయి వుంటాడు. ఉత్తరమంతా మా ఆవిడే చదివింది. సంవత్స రాది పండక్కు తనయింటికి మేము రానందుకు చాలనిష్ఠుర వాక్యాలు నామీదికి విడువబడినై. చివరకు మాకోసం రెండురోజులు చూచి, చూచి, ముసలమ్మ పండుగ వెళ్లిన రెండోనాడు నైజాం వెళ్లిపోయిందని చదివింది. పీడా వద లింది పో అన్నాను. లీలమాత్రం అమ్మమ్మకోసం నాలుగు రోజులు దిగులుపడింది.

---

# కాఫీ

ప్రతిరోజూ చూస్తున్నానుకదా! నేను మధ్యాహ్నం స్కూలునుంచి ఎఱ్ఱ నెండలో చేవుడా అంటూ ఇంటికి నడిచి వస్తే, తలుపు బిడాయించి వుంటుంది. లోపల రాణీగారు గుఱ్ఱు తీస్తుంటుంది. నేను బయటనిల్చుని 'లీలా! లీలా!' అంటూ ఓగంటసేపు తలుపు దగ్గర పాట పాడగా పాడగా 'అబ్బ! ఏం గోల చేస్తారండీ!' అని గొణుగుతూ, కళ్ళు నులుముకుంటూ, నిద్రమత్తుమీాద పడుతూ లేస్తూ, వచ్చి తలుపు తీస్తుంది. తీసిందే తడవుగా మళ్ళీ యథాక్రమంగా పడుకుని ముసుగెట్టు కుంటుంది. ఇంత నిద్రమత్తు అయితే ఎలాగబ్బా మరీను.

సాధారణంగా నేను మధ్యాహ్నం ఎందుకు వస్తానంటే, ఏదో ఇంట్లో కాఫీగట్రా చేస్తుందేమో, ఇంజన్‌లో కాస్త బొగ్గేసి మరీ పోదామని వుద్దేశం. లేకపోతే పొద్దున పది గంటలకు నాలుగు మెతుకులు తినిపోయి సాయంత్రంవరకూ ఉండ లేనుగా. అందులో గుండెలు కరగేటట్టు స్కూల్లో పిల్ల లకు బోధ చేయవలసినపని ఒకటి. జాగ్రఫీ మాష్టరునుగదూ హైస్కూలులో!

నేనింటికి వచ్చేసరికి లీల ఈవిధంగా నిద్రమత్తుచూపి స్తుంటే నాకుమరీ రానురాను కోపం ఎక్కువౌతున్నది. ఎన్నా ళ్ళని సహిస్తాను. ఒకరోజా! రెండురోజులా! రోజూ ఇదే వరసైపోయె. నేనాపాటికి వస్తానని తెలుసుకదా! కాస్త ఫల హారంచేసి, ఇన్ని కాఫీనీళ్ళు కాచి వుంచకూడదూ! దున్న పోతులాగా నిద్రపోకపోతే.

పాపంగదా అని నేను చనువు చూపించిన కొద్దీ దానికి నిర్లక్ష్యం బలిసిపోయింది. ఎంతసేపటికీ ఆడదాన్ని కాళ్ళ

రాయాలండీ అంటారు కొంతమంది; ఆమాటలు నాకు రుచిం చవుగాని కొంతవరకు సత్యవంతము లేమోనని అనుమానపడ తాను అప్పుడప్పుడు.

వచ్చిన అవస్థ ఏమిటయ్యా అంటే నేను దాన్ని మంద లించడానికికూడా వీల్లేకుండా వచ్చింది. కారణమేమంటే మే మొకరియింట్లో దక్షిణభాగంలో అద్దెకు కాపురమున్నాం. అవతలిభాగంలో ఇంటివా రున్నారు. ఆయింటి ఆవిడ పెద్ద ముత్తయిదువ; మాయిద్దరి కలహాల్లో అనవసరంగా జోక్యం కలిగించుకుంటుంది. నేనెప్పుడైనా లీలను కోపంచేస్తుంటే ఆమె దుడదుడా దానికి వత్తాసి వచ్చి నన్నంటుందిగదా! 'అబ్బాయీ! ఆ అమ్మాయి నెందుకు కోప్పడతావూ? చిన్న పిల్ల. కాపురానికి వచ్చి ఏడాదైనా కాలేదు సరిగ్గా. ఏదైనా దానివల్ల తప్పువస్తే మగవాడివి నీవే సర్దుకుపోవాలి.' అంటుంది. ఈవిడ వత్తాసి చూచుకుని మరీ నిర్లక్ష్యం జాస్తి అయింది లీలకు. కూరల్లో మరికాస్త వుప్పువేయడం సాగిం చింది. బడివేళకు వంటకావడములేదు. నాగదిలో నేను కాల్చి పారవేసిన సిగరెట్టు ముక్కలసంఖ్య ఎక్కువౌతున్నది; ఎప్పుడైనా ఊడ్పించిన పాపాన పోతేనా మరి!

ఇన్నితప్పులూ క్షమించేస్తాను లీలగనుక మధ్యాహ్నం స్కూలునుంచి రాగానే తాను కాఫీచేసి వుంచిందంటే. కాని అదిలేదుగా! ప్రతిరోజూ వచ్చినట్టు నేనే చేసుకొనేవాణ్ణి కాఫీ అప్పటికప్పుడు. పైగా ఇంకో తమాషా. ఇంత కష్టపడి నేను కాఫీ చేసుకుంటానా! చివరకు చల్లారపోసే సమయానికి నిద్ర ఎక్కడపోతుందో చల్లగావచ్చి దగ్గర కూర్చుంటుంది, తన భాగంకోసం చిలిపినవ్వు నవ్వుకుంటూ. పాపంగదా అని

ఒకగిన్నెడు దాని ముఖానపోసి మిగతాది నేను తాగి స్కూలుకు పోతా. ఇదీ రోజూ జరిగే ఘట్టం.

నాకీ స్కూలుమాస్టరీ వుద్యోగం దొరికిన ఆరునెల్ల నుంచీ ఇదేవిధంగా రోజూ కాఫీచేయడంలో 'ప్రొఫెసర్' నై పోయాను. ఐనా నన్నొక అభిమానం బాధిస్తూనే వున్నది. ఇవ్వాళ కాఫీచేసుకోటంతోనే సరిపోయింది. రేపు వంట కూడా చేయలేనని పడుకుంటుంది. దేవుడా అంటూ చేసుకో వాలిసిందేనా? ఇంకా నాలుగు రోజులుపోతే 'నావిస్తర్లో కూడా కాస్తవడ్డించి మరీ మీరు భోజనం చెయ్యండి' అంటుంది. ఏముందీ! స్త్రీకి అలుసిచ్చినకొద్దీ నెత్తికెక్కి కూర్చునే ప్రకృతిలాగుంది. నాకేమీ పాలుపోవడంలేదు. ఒకనాడు స్కూలునుంచి మధ్యాహ్నం ఇంటికివస్తూ ఆలో చించుకున్నాను. 'ఛా! ఛా! భార్యను లొంగదీసుకోలేని నా బ్రతుకంతా నీచమైపోతున్నది. ఇంకా నా అసమర్థత బడి పిల్లల కెవరికీ తెలియకపోవడంచేత డాబుసరితో మర్యాద నిల బెట్టుకుంటున్నాను. వాళ్ళకు గనుక తెలిసెనా, నా బ్రతుకు స్కూల్లో, బయటాకూడా కడిగిపోస్తారు; ఏకేస్తారు దూది పింజలాగా.' ఇంకా ఏమేమో ఆలోచించుకున్నాను. చివరకు 'ఇకనుంచి ఈజన్మలో ఎప్పుడూ కుంపటిరాజేసి నేను కాఫీ చేయను' అని నిశ్చయించుకున్నాను.

తిన్నగా ఇంటికిపోయి తలుపు తట్టాను. కొంతసేపటికి తలుపులు తెరుచుకున్నవి. నాముఖంలో ఒక గంభీరత తెచ్చి పెట్టుకున్నాను. ఐనా లాభంలేకపోయింది; లీల నా ముఖం వేపు చూస్తేగా. తలుపు తీసింది. మళ్ళీ వెళ్ళి గాఢనిద్రలో మునిగిపోయింది.

నాకేమీ తోచడంలేదు. ఇల్లంతా నిశ్శబ్దంగావుంది. అక్కడ ఒక గూట్లో పొద్దున కాఫీచేసుకోగా మిగిలిన పాలు పోసివున్న వెండిగ్లాసు యథాస్థానంలో వుంది. అక్కడే ఆ మూల సగానికి బొగ్గులు పోసివున్న కుంపటి చిరకాల స్నేహ భావంతో సన్నాహ్వానిస్తున్నట్లు కనుపిస్తున్నది. అక్కడ ముక్కాలిపీటమీద మామిడికాయ మాగుక్క అగ్గిపెట్టెకూడా నా దృక్పథం తప్పించుకుని పోలేదు.

ఏలాగా ఇప్పుడు లీలనులేపి కాఫీ చేయించటం? గుట్టు కూడా తీస్తున్నది సన్నగా. నా ప్రయోజకత్వం పరీక్షచేసే సమయం అది. లీలను లేపి కాఫీ చేయమని డబాయిద్దామా అంటే ఒకవేళ అది నిద్రమత్తుమీద విసుక్కొని లేవకపోతే యథాప్రకారముగా నేనే చేసుకోవలసి వస్తుందేమో. అది మరి అవమానకరమైంది. కనుక కిక్కురుమనకుండా రోజుకు మల్లే నేనే కుంపటి రాజేసుకుంటే బాగుండేలాగుంది.

కుంపటి అంటించుకున్నాను నేనే. డికాక్షన్ నీళ్ళు కాగుతున్నవి. నేను అటూ, ఇటూ పచారుచేస్తూన్నాను. సాయంత్రం నాల్గవఘారం వాళ్ళకు చెప్పవలసిన జాగ్రఫీ పాఠం నెమరుకు తెచ్చుకుంటూ. డికాక్షన్ నీళ్ళు సలసలా కాగినై. నేను చప్పుడుకాకుండా దొంగతనంగా వంటయింట్లో పాలు తాగబోయే మార్జాలంలాగా అడుగులు వేసుకుంటూపోయి లీల మెడలో మంగళసూత్రానికి కట్టివున్న తాళపుచెవిని విప్పుకొని పెట్టెతీసి, అందులో వున్న కాఫీపొడుం డబ్బా తెచ్చుకున్నాను. లీలకు నిద్రాభంగం కాకుండా జాగ్రత్త పడ్డాను.

కాఫీ తయారైంది దేవలోకంలో అమృతంలాగా. ఇక చల్లార్చుకోవాలి. ఒక గిన్నెలోనుంచి మరోగిన్నెలోకి ఎత్తి పోస్తూ చల్లార్చటం మొదలెట్టేనంటే చప్పుడౌతుంది. చప్పుడౌతే లీలకు మెలకువ వస్తుందేమో. ఇప్పుడు దాన్ని లేప కూడదు. తగిన శాస్తి చేయాలి. ఈ కాఫీలో ఒకచుక్కకూడా దానికివ్వను. విసనకర్రతో విసరుతూ కాఫీచల్లార్చుకుంటున్నా.

నిజంగా కాఫీయొక్క ఆ మనోహరమైన రంగులోనే వుంది కొంతమజా. అందుకనే కాఫీరంగు చీరలంటే ఆడ వాళ్ళకు చాలాయిష్టం. రంగు కేంగాని నేనిప్పుడు తయారు చేసిన కాఫీయొక్క ఘుమఘుమాయింపు మాత్రం ఘాటుగా వుండి మా యిల్లంతా ఆవరించింది. ఈ సౌరభానికి లీలనిద్ర తెరలువిచ్చి పోతుందేమోనని నా భయం. అందుచేత ఆలస్యం కాకుండా తొందర తొందరగా కాఫీ తాగేశాను, పెదవులూ నాలుకా కొంచెం కాలుతున్నా ఓర్చుకుంటూ. ఖాళీ గిన్నెలు అక్కడే వదిలివేశాను. లీల నిద్రపోతూనేవుంది పాపం.

స్కూలునుంచి రాగానే విడిచి వంకెకు తగిలించిన కోటు మళ్ళీ ధరించుకున్నా. అద్దములో చూచుకుని తలగుడ్డ చుట్టుకున్నా. ఉపాధ్యాయ వేషం పూర్తి ఐంది. జాగ్రఫీ చేతపట్టుకొని స్కూలుకు వెళ్ళబోతూ లీలను లేపి 'స్కూలుకు పోతున్నాను తలుపు వేసుకో' అని చెప్పి వాకిలిగడప దాటేను. లీల లేచి గుమ్మందాకా వచ్చింది. అక్కడే వున్నవిగా ఖాళీ గిన్నెలన్నీ! చూచింది, మళ్ళీ నా వేపుచూచింది. ఆమె ముఖం చూస్తే కొద్దిగా కోపం వచ్చిందేమో ననుకున్నాను. మాట్లాడకుండా స్కూలుకు వెళ్ళేను.

లీల భాగంకూడా ఆ నాడు నేనే తాగినందుచేత 'కాఫీ డోసు' ఎక్కువై పాఠం బాగానే చెప్పేను. పిల్లలెవరూ అల్లరిచేయకుండా విన్నారు. కాఫీ అంటే మంచి ప్రుద్రేకం కలిగించే వస్తువు సుమండీ !

మళ్ళీమర్నాడు స్కూలు వదిలిపెట్టిన తర్వాత ఇంటికి వచ్చాను మధ్యాహ్నం. రోజుకుమల్లే లేదు ఆనాటి వ్యవహారం. తలుపులు తెరచుకొనే వున్నవి. లీల నిద్రపోవడం లేదు. హాల్లో పడక కుర్చీలో వయ్యారంగా పడుకుని ఊలుతో విసనకఱ్ఱ అల్లుతున్నది. నేను రాగానే మర్యాదార్థంగా లేచి నాకోసం కుర్చీ ఖాళీచేసి అక్కడ నిల్చున్నది, అల్లుతూవున్న విసనకఱ్ఱ చేతుల్లో పట్టుకుని. ఆమె కన్నుల్లో నిద్రమత్తు కనుపించడములేదు. సహజమైన కాంతితో జ్యోతుల్లాగా మెరుస్తున్నవి. తెల్లనిచీర కట్టుకున్నది. అప్పుడే తలదువ్వుకుని అల్లుకున్న నల్లత్రాచులాంటి ఆ పొడుగాటిజడ భుజము మీదుగా ముందరకు తీసుకున్నది; ఉన్నతవక్షంమీద నాట్యం చేస్తూ అదో సొగసుగావున్నది. సహజంగా అందమైన పిల్ల లీల. అందులో ఆముస్తాబు మీద నా కళ్ళు మెరిసిపోయి ఒక్కసారి ఈ చేతుల్లో నులిమివేద్దామా అనిపించిది ఆ సౌందర్య కుసుమాన్ని.

కాని ఏమీమాట్లాడకుండా గంభీరంగా కుర్చీలో పడుకున్నాను. సహజంగా వాగుడుకత్తెఐనా లీలకూడా మౌనంతోనే వుంది. ఆమె విశాలనేత్రాలలో నల్లగుడ్లు చపలంగా అటూ ఇటూ పరుగెత్తుతున్నవి. చివరకు అక్కడ కింద పరచివున్న చిరిచాపమీద గోడకానుకొని కూర్చున్నది.

'కూర్చుంటావేం? వేగిరం కాఫీచెయ్యి. స్కూలు వేళౌతున్నది'

'రోజూ మీరే చేసుకుంటున్నారుగా ఇవ్వాళ నేనెందుకు?'

'అనవసరప్రవాదం పెంచక. చేస్తావా? చేయవా?'

'కోపపడకండి, పాలులేవివ్వాళ'

'ఎందుచేత?'

'ఇప్పుడే కాఫీచేసుకుని తాగేశాను.'

చల్లారిన కుంపటీ, మసిపట్టిన ఒకగిన్నె ఆ మూల నాకు కనిపించినవి. నిండా కోపమువచ్చిందినాకు. ఒళ్ళంతా జలదరించింది.

'అయితే నామాట మరపువచ్చిందా నీకు?' అని అడిగాను.

'నా మాటమాత్రం మీకు జ్ఞాపకంవుందా నిన్న?'

'నేను స్కూల్లో వాగివాగి ఈ పాటికివస్తానని ఎరుగుదువుకదా! కాఫీఅంతా నీవే చేసుకుని తాగేస్తే ఏమనుకున్నావు?'

'ఇంట్లో చాకిరీ చేసిచేసి అలసిపోయి వుంటాను గదా! నిన్న కాఫీఅంతా, ఒక్క చుక్కైనా నాకు మిగల్చకుండా తాగేశారే ఏమిటో మీ అభిప్రాయం?'

'అభిప్రాయ మేమిటి? నేను చేసుకున్నాను; తాగేశాను; నీవు చేశావా?'

'నేను చేసుకోనేగా, నేనూ తాగేనూ?'

'తెలివి తేటలు చూపించకు నీవుచేసిన పనిలో నిర్లక్ష్యస్వభావం వెల్లడౌతున్నది.'

'నిన్న మీరు చేసిన పనిలో మీకు నా మీద వున్న ప్రేమ వ్యక్తమౌతున్నది కాబోలు.'

'సంతోషించాను, నోరుమూసుకో. చేసిన తప్పుకు పశ్చాత్తాపపడక సమర్థించుకో ప్రయత్నిస్తా వెందుకు? చూస్తున్నానుకదా! రాను రాను మాటల్లో, చేతల్లో అన్నిట్లో నిర్లక్ష్యం కనుపిస్తూనేవుంది. అల్లాంటి వేషాలు సాగవుసుమా! నేను సహించేవాణ్ణిగాదు.' నా పెదవులదిరినై. కనుబొమలు ముడిపడినై. కన్ను లెఱ్ఱబడ్డట్లుకూడా వున్నవి.

లీల చలించలేదు. ప్రశాంతంగా వున్నది ముఖం. పెదవులమీద లేతనవ్వు కదిలాడుతూనే వున్నది. దాన్ని చూచినకొద్దీ నా కోపం మరింత ఎక్కువౌతున్నది కాని లీల మాత్రం నా కోపానికి తానేమీ వెరవనట్లుగా నావేపే చూస్తున్నది నవ్వుతూ. నా కోపానికి భయపడి గడగడ లాడే టందుకు బడిపిల్లవాణ్ణై తేగా. చేసుకున్న భార్య. నేను పంతులునైనా నాకే పంతులమ్మగా వుంది.

ఆ కోపంమీద కుర్చీలోనుంచి చివాలునలేచి దబదబా పెట్టెతీసి నాలుగు చిల్లరడబ్బులు జేబులో వేసుకుని పోబో తున్నాను. నా వుద్దేశమేమంటే, స్కూలుకు పోయేదారిలో అనేక కాఫీభవనాలు వున్నాయికదా ఏదో ఒకదానిలో దూరి, కప్పో రెండుకప్పులో కాఫీతాగి వెళ్ళుదామని. కాఫీ లేకపోతే స్కూల్లో పాఠంచెప్పటం కష్టం. నాది అందులో కాఫీగతప్రాణం.

పోబోతున్నా. ఇంతలో లీలవచ్చి నాచేయిపట్టుకున్నది.
'కాఫీతాగి వెళ్ళరూ?'

'ఏమిటి మరీచమత్కారంగావుంది నీ వేషం ఇవ్వాళ. పాలన్నీ కాఫీచేసికొని తాగేననవ్?'

'మరి కాఫీ లేకుండానే వెళ్ళుతారా స్కూలుకు?'

'అయితే ఏమిచేయమంటావు?'

'ఏమీలేదు. అప్పుడే స్కూలువేళ కాలేదుగా. కాస్సేపు కూర్చుని వెళ్ళండి.'

'ఇంతవరకు చాల సంతోషించాను నీవేషానికి ఇంకా ఏముంది?'

'రండి తెలుస్తుంది' అని కుర్చీ వేపులాగటం మొదలెట్టింది. ఆమె లేతచేతిపట్టు విడిపించుకోలేక పోయాను. మొదట వచ్చిన కోపంకూడా చాలావరకు తగ్గింది. పోనీ ఇంకా టైము కాలేదుకదా అని మళ్ళీ కుర్చీలో దేహంవాల్చాను. లీల వంటయింట్లోకి పోయి మూతపెట్టివున్న ఒకగిన్నెతో ప్రత్యక్షమైంది. నేనలా చూస్తూ ఊరుకున్నాను. 'ఏమిటదీ!' అని కూడా అడగలేదు. అంతా నాటకంలా వుంది.

'ఐతే మీలాంటిదాన్నే నేనుకూడా అని తలుస్తున్నారు కాబోలు మీరు. మీరంటే నిన్న కాఫీ అంతా నాకు లేకుండా తాగేయగలిగేరు. కాని, నాకలా ప్రాణంవొప్పదు సుమండీ! హిందూ స్త్రీకి భర్తే దైవం. అతన్నే ఎల్లప్పుడూ ఆరాధించుకుంటుంది. ఆయనచేత అనుభవింపబడని దేదిన్నీ ఆమె ముట్టనేముట్టదు. నాధుని ఉచ్ఛిష్టమే ఆమెకు పంచభక్ష్యపరమాన్నాలు. మీదృష్టిలో నేనొక నీచురాలినిగా కనబడి వుంటాను ఈరోజున. కాని అంత అభాగ్యురాలను కాదు. నన్ను మీరు బాగా గుర్తెరుగకున్నందుకు నాకు దుఃఖంగా వున్నది.'

'పెద్ద వుపన్యాసం చెప్పేవుకాని, హిందూ స్త్రీ భర్త చేత కాఫీ చేయించుతుందా రోజూ?'

'అదే కాబోలు ఇవ్వాళ మీకు నామీద వచ్చిన కోపానికి కారణం! సరదాగా మీరే చేసుకుంటున్నా రనుకుంటున్నాను కాని నేను చేయనన్నానా?'

'మగవాడికి వంటచేయడంకూడా సరదేనా?'

'ఇంతకోపం మనసులో వుంచుకోకపోతే నాకు చెప్పి వుండగూడదూ? నాకు తెలియదాయె' ఈలోగా తాను తెచ్చిన గిన్నెలోనుంచి, సేమ్యాపాయసం ఒక పింగాణిగిన్నెలోపోసి నాకందిస్తూ చిరునవ్వుతో 'ఇకనుంచి నేనే కాఫీచేస్తుంటాను. మీరు కుంపటి ముట్టుకోనేవద్దు. నన్ను క్షమించండి' అంది.

ఇప్పటికి కోపమంతా చల్లారిపోయింది నాకు. పాయసం చప్పరిస్తూ 'ఇవ్వాళ ఈ ఆహారంమీద మనసుపోయిందా నీకు?' అన్నాను.

లీల కుర్చీదగ్గర నిల్చుని శరీరలత కొంచెంవంచి నా కోటు 'కాలర్' తడుముతూ నా కళ్లల్లోకిచూస్తూ 'క్షమించారా?' అంది. నవ్వుతూన్న నా కళ్ళే ప్రత్యుత్తరం చెప్పినై.

లీల శరీరమేకాదు, మనస్సుకూడా అందమైందిసుమా అనుకున్నాను. రెండుగిన్నెల పాయసం తాగేసి స్కూలుకు పోవడానికి లేచాను.

'ఇంతకూ మీ కోపమంతా పోయిందా?' మధురంగా ప్రశ్నించింది లీల.

ప్రసన్నంగాచూస్తూ లీలను దగ్గరకు లాక్కున్నాను.

నాడు మొదలు ఈ రోజువరకూ నా చేతిమీదుగా కాఫీచేసుకుని ఎరుగను. ఎప్పుడైనా కాఫీలో పంచదార కలపటానికిగానీ, చల్లారపోయడానికిగానీ నేను వెళ్ళితే 'ఊరుకోండి. మీరు చేయిచేసుకోకండి' అంటుంది. పూర్వపు నిద్రమత్తంతా ఏమైందో!

# బాల్యస్నేహం

౧

'మాహాంతగొడవలతోనే మాకు తలమునకలై వుంటే నీ గొడవకూడా ఎవరికాకావలి' అని పాఠకులు నన్ను నిరుత్సాహపరచరని తలుస్తాను. ఈ నా కథలో నా సోదరీమణులు నేర్చుకోవాలిసింది ఏమీవుండదని నేననుకోను. ప్రస్తుత మనేకమంది భారతీయస్త్రీలకుమల్లేనే నాకుకూడా చదువనూ వ్రాయనూ రాకపోయేవుంటే మిమ్మల్ని ఈ పది పదిహేను నిముషాలు ఇలా కూర్చోపెట్టగలిగేదాన్ని కాను. మన తెలుగుభాషలో కాస్త అభిరుచీ, భారత భాగవతాలు చదివి అర్థంచేసుకోగలశక్తీ నాకు మోహనరావనే బాల్యస్నేహితుడు కల్పించాడు. జన్మ జన్మాంతరాలవరకూ అతనికి నేను కృతజ్ఞురాలను. ఏదో పరిజ్ఞానం ప్రసాదించి నా కతడు ఆధ్యాత్మికసహాయం చేశాడు.

అతడు నాకు బాల్యస్నేహితుడన్నాను. అవును. అతని కుటుంబం మాకుటుంబం ఇరుగుపొరుగున వుండి చాలకాలం నుంచీ మైత్రితో వుండేవి. మేమిద్దరమూ అప్పుడు బాల్యోచితమైన ఆటపాటల్లో కలిసిమెలిసి వుండేవాళ్ళం. వాళ్ళనాన్న మ్మమల్ని రోజూ సాయంత్రంపూట పొలాలకేసి షికారు తీసికెళ్ళేవారు. మాఅమ్మ నాకు పూలపరికిణీ, సిల్కుజాకెట్టూ తొడిగి పంపేది. నారాయణరావుగారి వెనకాలే మేమిద్దరమూ చెట్టాపట్టాలుపట్టుకొని ఏమో మాట్లాడుకుంటూ వెళ్ళేవాళ్ళం. చూచేవాళ్ళంతా చాలాముచ్చటపడి మాకు భార్యాభర్తల సంబంధం కట్టేశారు.

ఇరుగుపొరుగు ఆడవాళ్ళంతా నన్ను చూచినప్పుడల్లా 'మోహనరావు భార్య' 'మోహనరావు భార్య' అని నవ్వేవాళ్లు. అప్పుడు నాకు ఉడుకుమోతుతనం వచ్చి కళ్ళనీళ్ళపర్యంతం అయ్యేది. మాఅమ్మ నన్ను దగ్గరకు తీసికొని ముద్దుపెట్టుకొని చెంపలుదువ్వితే అంతా మరచిపోయి వాళ్ళతోటలో ఆడుకునేదాన్ని. అతడు పూలన్నీ కోసి నాచేతుల్లోపోసేవాడు. ఏమీ యెరుగని నా బాల్యహృదయం అప్పుడెందుకో ఉబికిపోయేది. ఆ సంతోషంలో లేడిలాగా మా అమ్మ దగ్గరకు పరుగెత్తుకొనిపోయి చెండుగుచ్చి నా జడలో పెట్టించుకుని మళ్ళీవచ్చి నా స్నేహితునికి చూపించేదాన్ని.

ఈ బాల్యమిత్రుడు నా భర్త కావాలన్న వుద్దేశం నాకెప్పుడూ లేదు. అతన్నే నేను వివాహం చేసుకుంటే అతనిమీద నాయిప్పటి అధికారమూ, చనువూ ఉండవని అనుకునేదాన్ని. అతడు హైస్కూలుకు పోతూవుంటే మాయింటి చావడిలో నిల్చొని కనిపించే అంతవరకూ పిలుస్తూ అల్లరిచేయు చేయుడానికి వీలుండదని నా వూహ. ఇప్పుడుమల్లే పుస్తకం చేతపట్టుకపోయి అతని తొడమీద కూర్చొని పాఠం చెప్పించుకోటానికి ప్రతిబంధకమౌతుందని నా ఉద్దేశం. స్వామిరావుగారి కూతురులాగా పండుగకు మొగుడువస్తే గదిలోనే బియ్యపుబస్తాచాటున దాగికొని ఉండాలేమోనని నాభయం. అందుచేత నేను మోహనరావును పెండ్లి చేసుకోవాలని అనుకోలేదు. దాంపత్యబాంధవ్యంకంటే ఒక ఉత్కృష్ట సంబంధం మా యిద్దరినీ బంధించివున్నదని మాత్రం నా హృదయంలో ధ్వనించేది.

నా స్మృతిపథంలో ఎక్కడో దూరాన్న మసకమసకగా కనిపిస్తూన్న నా బాల్యదశలో, విద్యుద్దీపాల్లాగా ప్రకాశిస్తూన్న కొన్ని అనుభవాలు మాత్రమే మీకు సూచిస్తున్నాను. పాఠకసోదరీమణుల హృదయాలు ఈ సమయంలో తమకుగూడా ఇల్లాంటి అనుభవా లున్నాయేమోనని, ఒక్కసారి తమ బాల్యావస్థకేసి చూచుకుంటున్న వనుకుంటాను. కొందరు నా అప్పటి సౌఖ్యజీవితానికి అసూయపడుతూ ఉండొచ్చు; కాని తరువాత వినండి.

మోహనరా వప్పుడు మెట్రిక్యులేషన్ క్లాసులో చదువుకుంటున్నాడు. అతడు చాల అందగాడనీ, నాకు తగిన వరుడనీ, ఆడవాళ్ళంతా మాయింట్లో మీటింగు చేసినప్పుడల్లా అనుకుండేవాళ్ళు. కాని నేనుమాత్రం అతని సౌందర్యం ఎప్పుడూ విమర్శించలేదు. నిండా పూచివున్న గులాబిచెట్టు చూస్తే నాకంటికింపుగానే వుంటుంది. సూర్యుడస్తమిస్తూన్నప్పుడారంగులు చూస్తే మానవాతీతమైన ఒక శిల్పిహస్తం నాకు స్ఫురించేదే. సాయంకాలం షికారు పోయినప్పుడాపొలాల్లో నా కానందంగానే వుండేది. కోయిల కూసినా, పిట్టలు బార్లు కట్టి ఆకాశమార్గాన ఎగిరిపోతున్నా, ఉత్సాహంతో నా స్నేహితునికిగూడా చూపించేదాన్ని. కాని ప్రకృతి సౌందర్యమంతా మనుష్య వ్యక్తిలోకూడా ప్రత్యక్షమై వుంటుందని అప్పటి నా బాల్యహృదయానికి తోచనేలేదు. అందుచేతనే మోహనరావు శరీరసౌందర్యం నన్నాకర్షించలేదు. ఇతర బాలురకంటే అతడు చాలా మంచివాడనిమాత్రం నామనస్సు చెప్పేది. గొప్ప తెలివైనవాడనికూడా నమ్మకం. అందుకు

మెట్రిక్యులేషన్ పరీక్షలో ఆస్కూల్లోకల్లా ప్రథముడుగా కృతార్థుడుకావడం సాక్ష్యం.

నారాయణరావుగారు రొక రిటైర్డు ఉద్యోగి. ఆయన్ని అందరూ ఎరుగుదురు. కాని ఆయనతో ముఖాముఖి పరిచయము కలవాళ్ళు తక్కువ. ఆయనది మితంగా మాట్లాడే స్వభావం. కాలానుసరణంగా సంఘంలో మార్పు అవసరమనే వారిలో ఒకరైనా, 'సంస్కర్త' అనే పేరుకోసం ఆయనెప్పుడూ ఏమైదానంమీదా ఉపన్యాసం ఇచ్చియుండలేదు. ఆయనమీద ఆధారపడియున్న సంస్థ ఒకటీలేదు. వచ్చే 'పెన్షన్'తో ఆయన ప్రశాంతజీవితం గడుపుకుంటున్నాడు. ఉద్యోగంచేస్తున్న రోజుల్లో సంపాదించిన డబ్బు చాలావరకు బ్యాంకులో వున్నదని వదంతి. ఏలాగున్నా మోహనరావు మాత్రం ఒక గొప్ప ఆస్తికి ఔరసుడు. అందుచేతనే పరీక్షా ఫలితాలు తెలిసినతరువాత మానాన్న నన్ను మోహనరావుకిచ్చే విషయాన్ని నారాయణరావుగారితో కదిపేడు. అమ్మకూడా నారాయణరావుగారి కుటుంబముతో సబంధంచేసే విషయంలో చాలా ఉబలాటపడుతూనేవుంది. నాకుమాత్రం పెండ్లి అంటే ఏమీ అర్థంకాలేదు.

మోహనరావు తాను బి. ఏ. ప్యాసయ్యేటంతవరకూ పెండ్లిచేసుకోనని వాళ్ళనాన్నతో గట్టిగా చెప్పేశాడు. అందుచేత నారాయణరావుగారికి మానాన్న వేసినమంత్రం పారలేదు. మావివాహం జరుగలేదు. నాప్రియమిత్రుడు ఇంటర్మీడియేటు చదివేనిమిత్తం మద్రాసు పోయాడు. అప్పటికి నేను పదునొకండు వసంతకాలాలు మాత్రమే చూచివున్నాను.

ఆధ్యాత్మికశక్తికీ, పరమాత్మకూ ఉండే సంబంధాన్ని వ్యక్తీకరించి భార్యాభర్తలకు ఈ ప్రాపంచిక జీవితంలో ఒక చైతన్యాతీతజ్యోతిని ప్రత్యక్షం చేయడమే వివాహముయొక్క ముఖ్యోద్దేశం. వివాహ మనేది స్త్రీ పురుషుల ప్రత్యేకశక్తులను ఏకంచేసి ద్విగుణీకృతోత్సాహంతో కార్యరంగంలో పనిచేయిస్తుంది. కాని ఇప్పుడు ఆశయానికీ, ఆచరణకూ చాల దూరంవున్నది. కేవలము జంతువులవలె కామముతీర్చుకునేటందుకూ, చచ్చిపోయాక శ్రాద్ధాలు పెట్టేనిమిత్తం కుమారుణ్ణి కనేటందుకూ మాత్రమే పెండ్లి చేసుకుంటే వివాహోద్దేశం నెరవేరిందని చెప్పలేము. ముఖ్యంగా మన హిందూదేశంలో వివాహ మనేది అనేక యువతీ యువకుల పురోభివృద్ధికి ఆటంకమౌతున్నది. చెప్పకోటానికి సిగ్గౌతున్నది — చిరకాలము నుంచీ ఆధ్యాత్మిక దేశమంటూ పేరెన్నికగన్న మన ఆర్యావర్తంలో వరశుల్కాలతోనూ, కన్యాశుల్కాలతోనూ, ముక్కుపచ్చలారని పసిపిల్లల రక్తమాంసాలు కొనుక్కుంటున్నాం.

పన్నెండు సంవత్సరాల యీడుగల ఆడపడుచు భారత గృహస్థుని కంతభారంగా వుండడాని కేమిటి కారణం? నా పెండ్లికోసం మా నాన్న అంతగా మధనపడట మెందుకు? ఆ యీడులో పెండ్లి కాని ఆడపిల్లలు నేనుతప్ప మరెవ్వరూ లేరని నలువురూ అనుకుంటూంటే మాత్రం మనం చేసిన పాపకార్యం ఏమున్నది? అయినా, నాకప్పుడు వివాహం చేయడమనేది నాకుగానీ, మా నాన్నకుగానీ, ఆవశ్యకమైనదని సహేతుకంగా ఎవరు చెప్పగలుగుతారు?

నా వివాహవిషయమై మా తండ్రిగారు స్వయంగా కల్పించుకున్న దిగులుతో పెండ్లికుమాళ్ళకోసం అంగళ్ళు వెతుకుతున్నాడు. నేనేమో చిన్నచిన్న పుస్తకాలు తేలిగ్గా అర్థమయ్యేవి చదువుకుంటూ కాలం గడిపేదాన్ని. ఎక్కడైనా సందేహము వస్తే నారాయణరావుగారి దగ్గరకుపోయి నివృత్తిచేసికొనేదాన్ని. మోహనుడు వెళ్ళినప్పటినుంచీ ఈ విశాల ప్రపంచములో నేనొక్క దాన్నే వున్నట్లనిపించేది. అతడుపోతూ నాజీవితమాధుర్యాన్ని కూడా తీసికెళ్లినట్లున్నాడు

ఈ ప్రపంచములోని ప్రాణశక్తుల అన్నింటి చలనమూ ఈ అఖిలవిశ్వము వెలుపటనున్న ఒక అనంతప్రాణశక్తిపై ఆధారపడియున్నదని తోస్తుంది. దేశకాల నిమిత్తాలతో బంధింపబడియున్న సామాన్యమానవ హృదయం ఆ అనంతప్రాణశక్తిని తనయిచ్ఛకు లోబరచుకోలేదు. అందుకనే లోకంలో అనుకున్నది జరక్క విరుద్ధఫలితాలు కలుగుతూండటం. ఆమధ్య అకస్మాత్తుగా మా మేనమామ భార్య చచ్చిపోయినప్పుడు — ఎలాగైనా నన్ను మోహనరావు చేతుల్లోనే పెట్టాలని దృఢాభిప్రాయంతో వున్న మా అమ్మకూడా ఒక్కసారి మారిపోయింది. అకస్మాత్తుగా ఇప్పుడు తన అన్నగారికొక పెద్దవిపత్తు సంభవించిందనీ, నావంటి పెండ్లికెదిగిన కూతురు తనకున్నప్పుడు ఆ సమయములో తన అన్నయిల్లు నిలబెట్టకపోతే నలువురూ నోట్లో వుమ్మివేస్తారనీ, ఆమె చాలసార్లు మా నాన్నతో చెప్పింది. ఆయనమాత్రం ఈడూ జోడూ కాని సంబంధం చేయజాలనని గట్టిగా చెప్తూ వచ్చాడు. అందుచేత మాయింట్లో కొన్నాళ్ళవరకూ ఎన్నో కలహాలు రేగినై; మా నాన్న చాల కలవరపడ్డాడు.

మా మామ మమ్మల్ని చూడ్డానికి మా యింటికి వచ్చాడు. ఆయనకు జీవితంలో ముప్పాతికభాగం చెల్లిపోయింది. ఇక జరా(క్రాంతం కావలసిన ఒక పాతికపాలు మాత్రమే వున్నది. చిన్నప్పుడాయన నన్ను తన కూతురులాగా ఎత్తుకొని ఆడించి, అదీ ఇదీ కొనిపెట్టినవాడు.

ఒకనాడు నేను వంటయింటిగుమ్మంలో నిల్చొని మా అమ్మ కూరగాయలు తరుగుతూంటే చూస్తున్నాను. మా మామవచ్చి నా బుగ్గ పొడిచి 'ఏంవే పిల్లా! నన్ను పెండ్లి చేసుకుంటావా? చాల సొమ్ములు పెట్టుతాను' అంటూ నవ్వేడు. ఆ అనార్య శృంగారానికి మా అమ్మకూడా నవ్వింది. నేను సిగ్గభినయింపలేదు రంగంలో. అసహ్యం కలిగింది.

మా మామ చాలా ధనవంతుడే. గుంటూరులో ఆయనకొక పెద్దమేడ వున్నది. ఆ మేడలో నేనిక కాపురం చేయబోతానని మా అమ్మకు సంతోషమే. ఈడూ జోడు విషయంలో, అల్లాంటి పెళ్ళిళ్ళు అనేకం జరుగుతునే వున్నవని ఆమె సమాధానం.

ఒకవెంప భార్య వుపన్యాసాలూ, మరోవెంప బావమరిది (బతిమిలాడటం, మరోవంక ఆర్థిక పరిస్థితి క్లిష్టంగా వుండటం—అన్నీకలసి మా నాన్నను కలవరపెట్టినై. రోజులు గడువగా చెల్లాచెదరై ఆయన మనస్సులో తికమకలుగా పరుగెత్తుతూన్న ఆలోచనలన్నీ చివరకు మాఅమ్మ అభి(ప్రాయంతో ఏకీభూతమైనవి.

పెండ్లికి మా నాన్నకంతగా ఖర్చుకా లేదు. వివాహయజ్ఞం పూర్తి ఐంది దానికి అహుతీ అయిన యజ్ఞపశువును నేనే.

# 3

వివాహమైన మూడు నెలలుకూడా పూర్తిగా నిండక ముందే మా మామ నన్ను తన అదుపు ఆజ్ఞలలో వుంచుకునేటందుకు నాకేవో కొన్ని పాఠాలు నేర్పుకుంటానని గుంటూరు తీసికొనివచ్చాడు. కాని మా మామ శరీరపరిస్థితి ఆరోగ్యమైనది కాదని మీ కిదివరకే చెప్పి యుండవలసినది. ఆయనకు మొదటిపెండ్లి అయినా, ఈడు ముదిరిన తరువాతే జరుగుటకు కూడా ఆయన చిన్నతనంలో చేసిన దుందుడుకు పనులే కారణం. ఆ నాటి తన చెడు ప్రవర్తనకు ఫలం, మా మామ నేడనుభవిస్తున్నాడు. మూడు సంవత్సరాలనుంచి ఆయన మంచం దిగడంలేదు. పక్షవాతం వచ్చి కాళ్ళూ చేతులూ పడిపోయినై. లేచి రెండడుగులు వేయడానికి కూడా శక్తిలేదు. మలమూత్ర విసర్జనాదులుకూడా మంచందగ్గిరే. ఈ కర్మ విపాకానికి నే నాయన యింట్లో కాలుపెట్టిన వేళా విశేషమని కొందరన్నారు. నిజంగా ఒకని సుఖదుఃఖాలు మరోవ్యక్తియొక్క పాదచిహ్నాలమీద ఆధారపడి వుండే యెడల నేను దోషినే.

ఈ మూడేండ్లనుంచీ గుంటూరులో నా జీవితం సుఖమయమైనదని చెప్పలేను. అట్లని మా మామమీద నే నేవిధమైన దోషారోపణా చేయజాలను. ప్రతిరోజూ మధ్యాహ్నముపూట భోజనాత్పరం నే నాయన మంచందగ్గిర కూర్చొని కాళ్ళు పిసికేదాన్ని. అప్పుడాయన పడుకుని వుండికూడా నన్ను దగ్గరకు తీసుకొని ముద్దెట్టుకునేవాడు. నన్నెత్తుకుని ఆడించిననాటి వాత్సల్యం నాయందు మా మామకు పూర్తిగా

వున్నదికదా అని తృప్తిపడేదాన్ని. ఆయన పరిచర్యలో ఏమరి వుండేదాన్ని కాదు.

నాకు పదునారేండ్లు వచ్చినవి. సావిత్రీ, దమయంతీ మొదలైన పతివ్రతల కథలు నా చేత చదివించేవాడు మా మామ. సుకన్యోపాఖ్యానమంటే ఆయనకు చాలాయిష్టం. నేను స్వచ్ఛంగా, స్ఫుటంగా చదువుతూంటే ఆయన ఆశ్చర్య పోయేవాడు. అప్పుడు నేను నా చిన్ననాటి గురువును మోహనరావును జ్ఞాపకం తెచ్చుకుని నారాయణరావుగారి కుటుంబముతో మా మామకు పరిచయం చేసేదాన్ని. అలా మోహనుని గుణకీర్తన చేయడంలో నేనొక కవయిత్రినై పోతున్నానా అనిపించేది. కాని నా కవిత్వం మా మామ హృదయంలో వేరభిప్రాయంతో ధ్వనిస్తుందని నేనెప్పుడూ అనుకోలేదు.

ఒకనాడు నన్నాయన ప్రశ్నించాడు: 'పిల్లా! ఒకవేళ నేనీవ్యాధితో చనిపోయే యెడల మళ్ళీ ఎవరిని పెండ్లి చేసుకుంటావు? మోహనరావును...'

'మామా! దిగులుపడకు. నా జాతకంలో అసలు పెండ్లిఅంటూ లేనేలేదు.'

'ఒక మారైందిగా'

'అది నేను కోరివుండలేదు. నీవే నన్ను వివాహమాడేవు.'

ఈ మాటలు మా మామ ఏవిధంగా అర్థంచేసుకునేది నేనూహించలేదు. ఆయన ముఖవైఖరిలో కొంచెం మార్పు గలిగింది. 'నీవుమాత్రం ప్రాశ్చాత్య నాగరకతా తరంగం మీద చలిస్తూన్న ఆధునిక స్త్రీలోకానికి చెందిన దానవు కావా?' అంటూ కన్నులు మూసికొన్నాడు.

ఆయన కేమో కోపం వచ్చిందని గ్రహించాను. నా అజ్ఞానాన్ని క్షమించమంటూ ఆయన్ని అనునయించాను, నారింజపండ్లరసం పిండినగ్లాసు ఆయన పెదవులకందిస్తూ.

నాటినుంచీ స్త్రీల సౌశీల్యాన్ని శంకించేవాళ్ళు విధించే కట్టుబాట్లకు నేనూ లోనుగావలసి వచ్చింది. మనుష్యవ్యక్తి కొన్ని కట్టుబాట్లలో వుండడమనేది మంచిదే. కాని ఆకట్టు బాట్లు వ్యక్తిత్వాన్ని నశింపజేసేవైతే దేశాభ్యుదయం లేదు.

ఆ విశాలమైన భవనంలో మేమిద్దరమే కాపురం ఉంటు న్నది. అప్పుడప్పుడు జయప్రదాదేవి వచ్చి లోకాభిరామా యణం చెప్తూ ఉండకపోతే నాకు పొద్దుపోయేదే కాదు. ఆ అమ్మాయి చాల తెలివితేటలుగల పిల్ల. పదునాల్గేండ్ల చిరుతప్రాయంలో, అందులో స్త్రీకి అంత ప్రపంచజ్ఞానం ఉండటమనేది చాల అరుదైన విషయం. ఆమె భర్తకీ వూళ్లో గోతాలమిల్లులో పని. వాళ్ళీవూరు వచ్చి ఆరునెలలు కావస్తు న్నది. మాయింటిపక్కనే కాపురం ఉంటున్నారు.

జయప్రదతో నాకు స్నేహం కలసినప్పటినుంచీ, జీవితం చాలభాగం సంతోషంతోనే గడిపేస్తున్నాను. ఆమె సహజంగా హాస్యప్రియ. ఆమె వాక్చాతుర్యం మరోవ్యక్తికి బాధాజన కంగా ఉండదు. ఆమె నవ్వితే మరెవ్వరినీ ఎగతాళి చేసినట్లు కాదు, మనంకూడా ఆమెతోపాటు నవ్వేస్తాం హృదయం తేలి కయ్యేటట్లు. నేనామెను 'జయం' అని చనువుగా పిలుస్తాను.

ఎందుచేతనో ఆమధ్య మాయింటికామె రావడం మానేసింది అయిదారురోజులు. నాకేమీ తోచలేదప్పుడు. ఒంటరిగా ఖైదీకిమల్లే కాలం గడిపేను. ఎందుచేత రాలేదో

అని పరిపరివిధాలా ఆలోచించాను. ఆ నాలుగు రోజులూ నాకు యుగాల్లాగా తోచినై.

ఆమె రాకపోతే నేనన్నా పోయి పిలుచుకువద్దామని ఆనాడు మధ్యాహ్నం బయలుదేరాను. సూర్యుడు మబ్బుచేత ఆచ్ఛాదింప బడివున్నందున ఎండనిపించలేదు. అయినా దూరముకాదు కనుక శ్రమ అనిపించలేదు. చివర కామె యింటివద్దకు చేరుకున్నాను. లోన గడియ వేయబడియున్నది తలుపు.

తలుపు తట్టబోతూ 'జయం' అని కేకవేయ సిద్ధముగా వున్నాను. ఇంతలో గవ్వలు గలబరించినట్లుగా ఆమెనవ్వు నాకు వినుపించినది. తలుపుసందులో నుంచి లోనికి తొంగి చూచాను. ఆమెభర్త హాల్లో ఒక పడకకుర్చీమీద కాళ్ళుచాచు కుని పడుకున్నాడు. అతని ఒడిలో ముద్దులుమూటకట్టుతూ కూర్చున్నది జయం. ఏ పరియాచకమాడి భర్తను వంచించి నవ్వుతున్నదో ఆవిలాసిని అది ఆ ఏకాంతవాసులకే తెలియాలి.

అంతాచూచాను. నా కన్నులకది అపూర్వప్రదర్శన మైపోయింది. అలాగేచూస్తూన్నా. నా శరీరము కపించు తున్నది; భయముకాదు. ఒడలు గగుదాల్చినది, కోపము కాదు.

బలవంతముగా నా శరీరమును ఎట్లో మోసికొని పోయి ఇంటికి చేర్చాను. కొంతసేపు పడుకుని లేచునప్పటికి మళ్ళీ తేరుకున్నాను.

మరునా డామె మా యింటికి వచ్చినప్పుడు నా హృదయముప్పొంగి పోయింది. ఇల్లంతా కళకళలాడింది. నాగదిలో పాలగచ్చు చేసిన నేలమీద చిరుచాప పరచి ఆమెను కూర్చోబెట్టి అడిగేను.

'ఏమమ్మా! జయం! ఇనాళ్ళనుంచీ నా మీద శీతకన్ను వేశావూ! మీ వారు మా యింటికి రావద్దని చెప్పేరా?'

'ఆశ్చర్యంగావుంది నీవడిగిన ప్రశ్న' అంటూ ఆమె మందహాసం చేసింది.

'ఏమీ అల్లాంటి అధికారం భర్త భార్యమీద చలాయించుకుంటే తప్పా? శృంగారించుకుని గుమ్మములో నిల్చుండరాదనీ, పరపురుషునితో మాట్లాడకూడదనీ, పొరుగింటికి పోవద్దనీ, భర్త భార్యకు విధించడం సహజం!'

'అసూయాగ్రస్తుడైన ఒకానొకవ్యక్తి విధించే క్రూరచట్టాలతో మగజాతికంతకూ శాశ్వతమైన కళంకాన్ని ఆపాదిస్తున్నావు. మా వాగెప్పుడూ నన్ను నిర్బంధపెట్టరు. ప్రేమ స్వేచ్ఛలోనే వృద్ధిచెందాలని మా ఉద్దేశం'

'మరి నీవు మాయింటికి రాకపోవడానికి కారణం?'

'మొన్న క్రైస్తవుల హోర్వెస్టుపండుగ. యజమాని క్రైస్తవుడు కనుక 'మిల్లు'కు ఆదివారంతోసహా నాలుగు రోజులు సెలవువచ్చింది. అంచాత దొరక్క-దొరక్క దొరికిన అవకాశాన్ని పోగొట్టుకోకుండా ఇద్దరమూ ఆటపాటల్లో గడిపేవాళ్ళం కాలం. సాయంత్రం రోజూ సినీమాకు వెళ్ళేవాళ్ళం మొదటి ఆటకు.'

'నామీద కోపంవచ్చిందేమో అనుకున్నానుసుమా?'

'కాదు. మా వారింట్లో ఉంటే ఎకసెకలతో, పకపక లతో మా కంతలో పొద్దు కృంకిపోతుంది. అందుకనే మాకు చిల్కా-గోరింకలని పేరెట్టింది మా బామ్మ' అంటూ గలగల నవ్వింది జయం. ఆ నవ్వు ఆ విశాల భవనంలో తరగల్లా వ్యాపించిపోయి మా మామ చెవుల్లోకూడా దూరిందేమో, 'ఎవరికో పిల్లా! నీ సల్లాపాలూ' అంటూ ప్రశ్నించా డాయన నన్ను ద్దేశించి.

'నేనేనండీ! తాతగారూ! జయప్రదను' అని జవా బిచ్చింది ఆ చిన్నది.

'ఆయన నీకు తాతగారైతే, నేను నీకు అమ్మమ్మనా? నాయనమ్మనా?' అని అడిగేను ఆమె బుగ్గమీద మెల్లిగా తట్టుతూ.

'నీవు నాచిన్నక్కయ్యవు.'

'ఎలాగా?'

'నేను వయసుపట్టి వరుస నిర్ణయిస్తాను.'

ఆమెమాటలు నాకర్థంగాలేదు. కుమ్మంకేసి శూన్య దృక్కులు పారేస్తూకూర్చున్నా. సాయంకాలపు పైరగాలి చల్లగావీస్తూ మా జయప్రదాదేవి తలవెంట్రుకలతో ఆడు కుంటున్నది. కాస్సేపు మే మెవ్వరమూ మాట్లాడలేదు. ఇంతలో గోడమీద గడియారము ఐదుగంటల తరువాత అర గంటకొట్టింది. జయం వెంటనేలేచి 'అక్కా! నేనుపోతా. మావారు ఆఫీసునుంచివచ్చే వేళైంది. వారి స్నానానికి వేన్నీళ్లు కాచాలి,' అంది.

నేను నవ్వుతూ తమాషాగా అన్నాను. 'నాగరికత వడసిన నీవంటి ఇరవయ్యో శతాబ్దపు పిల్లకూడా అల్లాంటి పనులు చేయవలసిందేనా? పురుషులు స్త్రీలను బానిసల్లా వుపయోగించుకుంటున్నారని నీవెప్పుడూ అనుకోవూ?'

'అది స్త్రీ తత్వం తెలీనివాళ్ళు పుస్తకాల్లో వ్రాసిన మాట; నీ వెక్కడో చదివుంటావు. నా అనుభవంలో మాత్రం భర్తృసేవ చేస్తున్నప్పుడు నేనొక దాసీదాన్ననే భావం నా కెప్పుడూ కలుగదు. భర్తృసేవకు నన్ను ప్రేరేచేది నా హృదయంలోవున్న ఒక అనిర్వాచ్యమైన ప్రేమజ్యోతి. మా వారికి సేవచేసే అవకాశం దొరుకుతే నాకు సంతోషం.

వేదవాక్యాలు మంత్రాక్షరాల్లాగా నన్ను ముగ్ధురాలిని చేసివేసినై. వాటిఅర్థం నాకు పూర్తిగా తెలియలేదు. నాకు అగమ్యగోచరంగావున్న ఒక కొత్తవిషయమేదో ఆమెకు పూర్తిగా అనుభూతమై వున్నదనిమాత్రం నాకు రూఢి అయింది.

※

ఆ రాత్రి నాకు చాల పొద్దుపోయేటంతవరకూ నిద్ర పట్టలేదు. ఏవో పరస్పర విరుద్ధములైన అనేక భావాలు నా హృదయంలో పరువెత్తినవి. దీపమార్పుకుని నా గదిలో మంచంమీద పడుకున్నా.

'జయప్రదా దేవికి, నాకూ మంచిస్నేహంవున్నా మా యిద్దరకీ, ఉత్తర దక్షిణ ధృవాలకుండే అంతరం వున్నది. ఆమెది కేవలం సంతోషమయమైన జీవితం. ప్రపంచ మామె

కొక నందనవనం. శరత్కాలపు వెన్నెల ప్రాముకొని శోభా యమానముగ నున్న ఒక మైదానమున తన సౌధము నిర్మించుకున్న దామె. అంధకారమంతా పుంజీభూతమైవున్న గహ్వారాలామె ఎన్నడూ చూడలేదు.

'ఆమె హృదయంలో ప్రేమతత్వాన్ని గుఱించిన అనేక గ్రంథాలు వ్రాయబడి ఉన్నవి. ప్రేమ అనే రెండక్షరాలూ ఆమె వుచ్చరించినప్పుడు ఆమెనోట అమృతం చిందుతుంది. ఆమెకన్నులు తేజఃప్రపూరితము లైవి.'

'ఆమెకు తన భర్త యెడల భావము నాకనుభవము కానిది. ఆమె భర్తను సేవిస్తుంది; అందువల్ల ఆమెకు ఆనందం కలుగుతుంది. ప్రేమజ్యోతిట, ఆమెను భర్తృసేవకు ప్రేరేచేది.'

'ఆమె నాతో సంభాషిస్తూన్నప్పుడు ఆమె నావ ఆనంద వాయువు తోడై ప్రవాహవేగంతో కలసి చల్లగా నడచి పోతుంది. నా పడవ హఠాత్తుగా ఒక రాతికి తగులుకుని అభాగ్యం సూచిస్తుంది'

ఇల్లాంటి ఆలోచనలతో రాత్రి చాల పొద్దుపోయేటంతవరకూ నిద్రపట్టని కారణంచేత తెల్లవారి లేచేసరికి చాల నీరసంగావుండింది శరీరం. నిద్రకండ్లు నులుముకుంటూ పోయి మేడమీద కడకటాలముందు నిల్చుని ఉత్తరపువేపు బయలు అవలోకించా కాస్సేపు. అది హేమంతఋతువు. దట్టముగా అల్లుకునివున్న మంచు తెరలన్నీ అప్పుడప్పుడే మొలుస్తూన్న సూర్యరశ్మికి విచ్చిపోతున్నవి. గడ్డిమీద మంచుబిందువులు కొన్ని ముత్యాలవలె మెరుస్తున్నవి. దిక్కులన్నీ అజ్ఞానంలో నుంచి వెలుపలకు వస్తున్నట్లు తెలివిపొందుతున్నవి. నా హృదయంలో రేగుతున్న ఈ అవ్యక్త బాధమాత్రం శాంతిం

చలేదు. ఏ సుతిమెత్తని హృదయతంత్రి మోగుతున్నదో, ఏ తీరని కోర్కె కలవరపెట్టుతున్నదో నాకే పూర్తిగా అవగత మవడం లేదు.

౬

మళ్ళీ ఎన్నాళ్ళకో నా పుట్టింటికి రాగలిగేను. మా తమ్ముని వుపనయనమంటూ మా నాన్న నన్ను తీసికొని వచ్చాడు. గుంటూరులో మా మామకు వుపచారం చేయడానికి ఆయన పినతల్లి కూతురును—విధవావిడను ఉంచి వచ్చాము. తిరిగీ నన్ను త్వరగా పంపేయమనీ, ఆడపిల్ల పుట్టింట్లో అట్టే చాలకాలం వుండరాదనీ, మా నాన్నకు మా మామ ధర్మోపదేశంచేసి నాకు సెలవిచ్చాడు.

నేను మా వాళ్ళింటికి రాగానే నన్ను చూడ్డానికి ఇరుగు పొరుగు అమ్మలక్కలంతా వచ్చారు. నాలుగేండ్లనుంచీ నన్ను చూడనందున కొందరు నన్ను గుర్తించలేక పోయారు. 'ఏమే పిల్లా! మొగుడంత తీపయ్యాట్టే, ఇన్నాళ్ళా పుట్టిల్లు జ్ఞాపకం వచ్చిందికాదే!' అంటూ ఒకముసలావిడ పరియాచకంచేసింది. 'నాలుగేండ్లు కాపురం చేసినాకూడా ఒక్కగుంటమా చంకకు రాలేదేమే' అంటూ ఒకావిడ బుగ్గపోటు పొడిచింది, 'ఎల్ల కాలమూ గోగుకాడలా అల్లాగే వున్నావు ; లావుపడలేదే' అంటూ ఓ పెద్దముత్తైదువ కుశలప్రశ్న! ఎవరికి తోచినట్లు వాళ్ళు పల్కరించారు.

జయప్రదాదేవి నా దగ్గరవుంటే విళ్లందరకూ తగినట్లు జవాబిచ్చేదికదా అనుకున్నా. ఆ అమ్మాయిని కూడా రమ్మని

చాల బలవంత పెట్టేరు. కాని తన భర్తకి హోటలు తిండి పడదనీ, స్నానపానాదులు సరిగ్గా జరుగవేమోనని ఆమె భయపడ్డది.

నేను బయలుదేరే రోజున బండీ ఎక్కేవరకూ, ఆమె నాతోనే వున్నది. ఆనాడామె నాకు తనచేతులతో జడవేసి, తగినచీర ఒకటి పుర్మాయించి, అలంకారమంతా ముగిసిన తర్వాత నన్ను నిలువుటద్దంముందు నిలబెట్టి 'చూచుకో అక్కా; నీ సౌందర్యం నిజంగా మూడులోకాలనూ మోహింపజేస్తుంది' అన్నది. చూచుకున్నా; పూర్వం నారాయణరావుగారి వెనకాల మోహనరావుతో కలిసి షికారు వెళ్ళినప్పటినాకూ ఇప్పటివరకూ చాలాభేదంవున్నది. నా కన్నుల్లో ఒకవిధమైన తేట ప్రబలిపోయింది. నిజంగా నా తలవెంట్రుకల లోని నిగనిగ ఆకర్షణీయంగానే ఉన్నది. నా వక్షోభాగమున్నతమై, సన్నని నడుంమీద ఆధారపడివుండటము ఒక మనోహరమైన మార్పు. నా శరీరంలోని ఈపరిణామమంతా ఎందుకొరకో అనుకున్నాను. జయప్రద, చిరునవ్వు నవ్వుతూ 'అక్కా! నీ పాప చూచుకుని నువ్వే సిగ్గుపడతావెందుకు' అన్నది. ఆమెభావాలు ఆమెకే తెలియాలి.

చివరకు నా స్నేహితురాలి కౌగిలి విడిపించుకొని, బండి ఎక్కేను. స్నేహపిచ్చిలమైన ఆమెహృదయం రెండు కన్నీటి బొట్లు రాల్చింది.

నేను పుట్టింటికి చేరుకున్న మరునాడు సాయంత్రంపూట నారాయణరావుగారి దర్శనం చేసికొందామని వారియింటికి పొయ్యాను. అప్పుడు వారిగదిలో లేరాయన. 'అయ్యగారు తోటలోవున్నారమ్మా' అనిచెప్పేడు వాళ్ళ నౌకరు.

నేను సరాసరి తోటలోకి వెళ్ళుతూండగా మధ్య హాల్లో దక్షిణపు వైపుగదిలో మోహనరావు కూర్చొనివుంటే చూచాను కుర్చీలో. అతడు నన్ను చూడగానే 'సుశీ, సుశీ!' అని పిల్చేడు. ఆ పిలవడంలో చిన్నప్పుడతనికి నా యెడవున్న చనువంతా బయటపడింది. కాని నన్ను మాత్రం సిగ్గనేది వచ్చి ముంచుకున్నది. నేనతన్ని కన్నెత్తి పూర్తిగా చూడలేకపోయాను. కాని ఆ చూచిన క్షణంలోనే అతని నూగుమీసమూ, బలిష్ఠమైన అతని శరీరసౌష్ఠవమూ నా మనసున కెక్కనే ఎక్కినవి. నూత్న యౌవనము ముఖద్వారమునకు వచ్చాడతడు.

గదిలోకి వెళ్ళడమా? వెళ్ళకపోవడమా? సిగ్గేమో 'వద్దులే' అంటున్నది. మా పూర్వపరిచయమేమో 'అతని పిలుపు నిరాకరిస్తివా అతడు చిన్నపుచ్చుకుంటాడు సుమా! మీరు స్నేహితులేగా; చిన్నప్పుడతనితో ఆడుకోలేదూ నీవు! ఇప్పుడైనా వెళ్ళితే తప్పులేదులే' అంటున్నది.

ఎటూపోలేక అక్కడే కాస్సేపు నిల్చున్నా. మోహనరావే లేచివచ్చి నా చేయిపట్టుకుని 'రా. సుశీ! నన్నప్పుడే మరచిపోయావా?' అంటూ లోనికి తీసుకొనిపోయి కుర్చీలో నన్ను తనతొడమీద కూర్చోపెట్టుకున్నాడు. నాకేమో కొంచెం భయంభయంగా వుండింది.

అతడు నా వీపు దువ్వుతూ 'జన్మజన్మాలకు కూడా మనము విడిపోకుండా మనలను చిన్నప్పుడే బంధించి వైవ లేదూ మన బాల్యస్నేహం! వచ్చిన అవాంతరాలన్నీ నశించి పొయ్యేవే' అన్నాడు మందస్వరంలో. ఔనని రాయిద్దిగు

చెప్పుతున్నట్లుగా నాహృదయం దడదడ శబ్దంచేసింది. అతడు నన్నుగట్టిగా హృదయాని కదుముకున్నాడు.

చెట్టుమీఁదనుంచి సీమరేగుపండు కిందపడితే న్యూటన్ మహాశయునికి ఒక గొప్ప ప్రకృతిసత్యము గోచరమైనట్లు మోహనరావు వాక్యాలవల్ల ఆ సమయంలో నాకు జీవిత రహస్యమంతా గోచరించిది. నా ఆత్మమీఁద ఒక ముసుగు విడిపోయి ఆనంతలోచనములు విప్పినట్లయింది నా కెఱుక పడకుండ. హృదయంలో ఇన్నాళ్ళనుంచీ అణగివున్న కొన్ని రహస్య విషయాలు వెలుగులోనికి వచ్చినవి. కనుక్కున్నాను: నా ఆత్మ ఇన్నాళ్ళనుంచీ మధనపడుతున్నది ఈ పుణ్యమూర్తి కోసం, ఈ సౌందర్య పురుషునికోసం. అతని విశాలవక్షంలో తలదోనిసి అప్రయత్నంగా నా చేతులతో అతనికంఠము పైన వైచుకొని పడుకున్నప్పుడు శరీరమే మరచిపొయ్యాను, జీవిత సౌఖ్యమంతా ఆ క్షణంలోనే అనుభవించాను.



# అత్తాకోడళ్లు

## ౧

కనిపెంచిన తల్లిగానీ, లేకపోతే అగ్నిసాక్షిగా పెండ్లి చేసికొన్న అనుకూలురాలైన భార్యగానీ, ఎవరో ఒకరైనా రుచించకపోతే అతని జీవితం సుఖబాహ్యమైంది. ఒక గృహం దుఃఖమయంగా వుండటానికిగానీ, ఆనందదీపం వెలుగుతూ ప్రకాశిస్తూండుటకుగానీ, కారణ భూతురాలైంది స్త్రీ. అందు చేత అనేకమంది స్త్రీల హృదయాలు విద్యాగంధముచేత మూఢత్వము నశించి పునీతము కావాలి.

'అమ్మా! అమ్మా!' అని పిలుస్తూ బయట ఎఱ్ఱనెండలో నిల్చుని తలుపు తట్టుతున్నాడు. కృష్ణమూర్తి పగలు పదకొండుగంటలవేళ, గడచిన రెండుమూడు రోజులనుంచీ ఒకటేధారగా వర్షపాతమూటచేతగాబోలు ఆ నాడు తీక్షణంగావున్నాడు సూర్యుడు.

ఉద్యోగాలు దొరకక 'రిట్రెంచిమెంటు' అనేమాటకు కీర్తిప్రబలిపోయిన ఈరోజుల్లో 'ఇల్లు ఎలా గడవటమా?' అనే జుగుప్సతో కుంగిపోయే విద్యాధికులలో కృష్ణమూర్తి ఒకడు. వచ్చేరాబడి సున్నా. బీదసంసారం. రెక్కాడితేగాని పేగులాడవు. ఏంచేస్తాడు? ఏ కాసికంతల్లోనైనా సరే నాలుగు రాళ్ళు దొరుకుతవీ అంటే పోవడానికి సంసిద్ధుడై వున్నాడు. 'ఆ వూళ్ళో కాఫీహోటలున్నదా? షికార్లుపోవడానికి బీచిలాంటి దేమన్నావుందా? నాటక సమాజాలూ, సినిమాలూ వున్నాయా?' అని అడగడా బి. యే. చాలరోజులు తిరిగీ తిరిగీ ఉద్యోగం దొరకక చివరకు గుంటూరులో నాలుగు

ప్రైవేటు ట్యూషన్లు చెప్తూ కాలంగడుపుతున్నాడు. ఒక పాతిక రూపాయిలు గిట్టుతున్నాయి. 'ఏదో కొంతనయం' అనుకున్నాడు. నాలుగుసార్లు తట్టగా తలుపు తెరవబడింది. లోపలికి అడుగువేశాడు కృష్ణమూర్తి. అప్పుడే తలుపుతీసి, తలవ చుకొని వంటయింట్లోకి వెళ్ళిపోతున్నది అతనిభార్య. వెనుకనుంచి అతనికి కనిపిస్తున్నది ఆ పొడుగాటి సన్నజడ, సొమ్ములులేకుండా సౌందర్యం గక్కుతూవున్న ఆ మెడా, నిట్టూర్పు విడిచాడు కృష్ణమూర్తి. 'ఆమె చాలా అందగత్తె. ఐనా ప్రేమసహితంగాని ఆ సౌందర్యమంతా రసహీనంగా వుంది' అనుకున్నాడు.

తలుపుమూల చెప్పులువిడిచి అక్కడ నులకమంచం వాల్చుకుని కూర్చున్నాను. ఎక్కడో ఊరుచివర ట్యూషన్లు చెప్పుకుని వచ్చేసరికి చాలా అలసిపోయాడు. ఒళ్ళంతా చెమట పట్టింది. కళ్ళు తేలిపోతున్నై. నీరసపడ్డాడు.

పద్మావతి ఏవో పనులు చూచుకుంటున్నది వంట యింట్లో. భర్త ఎంత అలసిపోయాడో గమనించడానికి అతని వేపింతవరకూ చూడేలేదు. ఏదోవచ్చాడు, కూర్చున్నా డనుకున్నది.

కాని కృష్ణమూర్తి కవి హృదయంమాత్రం ఆరాట పడుతున్నది. ఊరికె ఆమె కటాక్షవీక్షణ ప్రసారంలో చెమ టార్పుకో తలస్తాడు. ఆమె చిరునవ్వు వెన్నెట్లో విశ్రాంతి కోరుకుంటాడు. తన జీవితంలో అవి తనకు అలభ్యమని తెలుసు. కాని కోరుకోడం మాత్రం మానివేయడు.

కట్టుకున్న ధోవతి చెంగుతో నుదుటిమీద చెమట చుక్కలు తుడుచుకున్నాడు. అక్కడే ఎదురగోడకానుకుని

కూర్చున్నది అతనితల్లి. కాస్సేపు నిశ్శబ్దంగా వున్నదింట్లో. ఎవ్వరూ మాట్లాడలేదు. చివరకు కృష్ణమూర్తే 'వంటైందా? మళ్ళీ ట్యూషన్లకు పోవాలి' అన్నాడు.

అతని తల్లి అందుకున్నది: 'ఈపాటి కష్టూడే ఎల్లా గాతుంది బాబూ వంట! నీ పెళ్ళాం సబ్బులుకో స్నానాలు చేసి, తలదువ్వి, చీర సింగారించుకుని వంటయింట్లో అడుగు పెట్టేసరికి పదిగంటలౌతున్నది.'

దీనికి పద్మావతి ఊరుకుందా? 'పోనీ, మీరే మడి గట్టుకో పోయారూ!' అని ఒక సమిధ తగిలించింది.

'ఏమిటే, లోపటనుంచి గొణుగుతున్నావూ? అయితే నిన్నూ నీ మొగుణ్ణీ కూచోబెట్టి ఎల్లకాలం చేసి పెడుతుంటా ననుకున్నావా? సాగవు పిల్లా! ఆ వేషాలు.'

'ఐతే మీరు ఆక్షేపాలు కట్టిపెట్టండి'

'అదీ! అలాగ మాటకు మాట వప్పజెప్పటం బాగా నేర్పి పంపిందిలే మీ అమ్మ. ఇంకేం, బాగా గడిదేరిపోయావు. ఇలాగైతే చక్కగానే సంసారం చేస్తావు.'

'ఓహో, మా అమ్మనుకూడా రంగంలోకి తెచ్చారూ?

కృష్ణారావుకు చిరాకనుపించింది. ఏమిటి అసందర్భపు వాదనంతా లేకపోతే. వింటున్నాడు; వాళ్ళ వాగ్ధోరణి ఆప డానికి శక్తి లేదతనికి. చదువుకున్నాడేగాని ఇల్లాంటి వ్యవహా రాల్లో అనుభవం లేదతగాడికి.

ఎవరిని ఏమంటాడు! విడువమంటే పాముకు కోపం. కరవమంటే కప్పకు కోపం. కాస్త తల్లినే మందలించి ఆమె అనేమాట లెన్నైనా పడచ్చు. కాని భార్యను పదిఅని ఆమె

చేత ఒకటిపడ్డా మానపోని. ఐనా, కృష్ణమూర్తి భార్యనే కసిరాడు. 'నోరు మూసుకో, ఒసే, అతిగా వాగక' అంటూ.

దీనికి ముసలావిడ జవాబిచ్చింది. 'దాన్నెందుకు కోపం చేస్తావు, నాయనా! నన్నే కోపంచేయి. నేనే మీ యిద్దరి మధ్యా శనిలాగా తగులుకున్నాను. ఈ కాలంలో కోడళ్ళు వచ్చేసరికి అత్తలు ఏ నూతో, గోయ్యో చూచుకుంటే సుఖం. లేకపోతే—'

'ఎందుకమ్మా అలా వుపన్యాసమిస్తావు. ఏమన్నాను నిన్ను!'

'నే నేమిస్తాను, నాయనా! వుపన్యాసాలూ. నా వంటి మీద సొమ్ములన్నీ అమ్మేసి, బి. ఏ. దాకా చెప్పించాను నీకు. వుపన్యాసాలిస్తే నీవివ్వాలి, లేకపోతే టక్కుటమార్లన్నీ నేర్చిన నీభార్యా ఇవ్వాలి. నాదేమిటి, కాటికి కాళ్ళుచాచి వున్నాను.'

'నిన్నేమీ అనలేదమ్మా నేనూ'

'ఇంకాఏమనాలి. అన్నీ నీ భార్యచేతనే అనిపిస్తున్నావు. నా బ్రతుకలా ఐంది. ఎందుకు! నాదారి నేనే వెళ్ళిపోతాను ఏకాశో, రామేశ్వరమో. పెళ్ళాంరాగానే తల్లి ముండ విషమైపోతుంది. నీకే కాదు; లోకం తరహా యేఅంత.' కన్నీళ్ళు పెట్టుకుంది ఆవిడ.

ఇంత గందరగోళం జరిగింతరువాత ఏమిసహిస్తుంది తిండి. నాలుగు మెతుకులు కొరికి బయటపడ్డాడు కృష్ణమూర్తి.

ఇల్లాంటి నాటకాలు కృష్ణమూర్తి యింట్లో కొత్త కాదు. రోజుకు నాలుగైదు జరుగుతుంటై. పెద్దది, ఎలాగైనా అత్తగారు ఏమైనాఅంటే పద్మావతి ఊరుకుంటే తప్పేముంది?

అలా ఊరుకోటం ఆ పిల్ల స్వభావంకాదు. మాటంటే అభిమానం జాస్తి. మాటకుమాట మళ్ళీ గిరాటు వేయవలసిందే. చిన్నప్పుడు మరీ గయ్యాళిగంపగా వుండేది. కోపంవస్తే తల్లిని రక్కిపెట్టేది. అత్తగారితో ఇంకా అంతదాకా రాలేదు. మాటల్లోనే వుంది వ్యవహారం.

ఇట్లో యింత కల్లోలంగా వుండటము కృష్ణమూర్తి మనస్సుకు చాలకష్టంగా వున్నది. అందుమూలకంగా అతని వుత్సాహం పూర్తిగా నశించింది. చదువుకునే రోజుల్లో తన భావిజీవితంగురించి ఎలాటి హర్మ్యాలు నిర్మించుకున్నాడో అవన్నీ పాతాళానికి కూలిపోయినై. రసహీనమైన కట్టెట తన శరీరం. తనచుట్టూ అంధకారమేట. దుఃఖసముద్రంలో ఏకాకిట తాను. విషాదగీతాలు రాసుకోటం సాగించాడు.

౨

'ఏమండీ! రేపో ఎల్లుండో మా నాన్నవస్తారట. మా కడగొట్టుతమ్ముడి అన్నప్రాశనట; తీసుకవెళ్తానని వుత్తరం రాశాడు. వెళ్తాను.'

'ఏం వెళ్ళకపోతే అన్నప్రాశనమాత్రానికి?'

'వెళ్లాలి. ఉదుగోతప్పిందెలాగా మారెండో తమ్ముడి తర్వాత ఎనిమిదేండ్లకు పుట్టుకొచ్చాడు. మళ్ళీ ఒకమారు చూచిరావాలి.'

'చూడటానికైతే మరోసారి పోవచ్చులే.'

'మీకేం, పడిచావమంటారు ఎన్నాళ్ళయినా ఇక్కడ ఈ చెరలో.'

'ఏంచెర వచ్చింది నీకు?'

'మీ కేం తెలుస్తుంది! రోజల్లా వూళ్ళోసంచారంచేసి వస్తారు. ఇంట్లో మీఅమ్మగారితో చీవాట్లు పడుతుండాలి నేను.'

'ఏమో పెద్దది. ఆ మెమాటలకు నీవు సమాధానం చెప్పడం మానేస్తే తగాదా లేదుగా'

'అనుకున్నా రా ! అంతమాత్రం ఎదురు చెప్పడంచేతే కొంత ఆగివుంది. లేకపోతే మనిషిని అమాంతంగా మింగి వేస్తుం దావిడ'

'పద్మా! చెప్తున్నాను: మీ మూలకంగా నా ఆత్మ శాంతి నశించింది. సుఖంలేదు.'

'నేను మాత్రం ఏం సుఖపడుతున్నాను? ఒకచీరా! ఒకసొమ్మా! దేనికీ నోచుకోలేదు. పైగా మీ అమ్మగారి శాపనార్థాలూ. చూచారా? నిన్న తలదువ్వుకుని, పొర పాటున పువ్వులుకూడా పెట్టుకుని, తలుపుదగ్గర నిలుచుంటే, అంటుందికదా: రోజుకు రెండుసార్లు తలదువ్వటం నేర్చావే ఇప్పుడూ. ఆ అంట్లు ఎవరు తోముతారనుకున్నావు - చూచి సహించలేనితనం కాకపోతే ఏమిటామాట!'

'........................'

అసలు నాజన్మలో ఎప్పుడూ అంట్లుతోమి ఎరగను. ఒక్కపనీచేయదావిడ. అన్నీ నాకే పుర్మాయిస్తుంది. పైగా చివరకు ఆక్షేపాలూ, చీవాట్లూను. పొద్దున్నే బావిదగ్గర బట్టలన్నీ నడుములుపగేలాగు వుతికి, వుతికి నేను వస్తే తాను శుభ్రంగా గోడకానుకొని కూచుని, చెంబులు తోమమని

పుర్మాయిస్తుంది తానే చేయకూడదూ ఆపని నాకోసం నిల వుంచకపోతే. అన్నిటికీ నేనే చావాలా?'

'..................................'

'మాట్లాడరేం ఇంతకూ నేను మీ భార్యాలా కనుపించడంలేదు. కూలిదానిలా ఉన్నాను. మొన్న మీ చెల్లెలుండిపోయిన రెండు నెలలూ మరీను. 'మంచి నీళ్ళు తీసుకురా, దొడ్డికిపోవాలి నీళ్ళు తెచ్చిపెట్టు,—అన్నీ పుర్మాయింపులు: ఎవరున్నారనో వీళ్ళదాసీ లిక్కడ!'

'పద్మా! మాటపడితే చెడిపోరు. నన్ను చూచైనా సహించలేవూ అదంతా! ప్రేమలేదూ నీకు నా మీద!'

'మీరు వేదాంతం చెప్తారు. అసలు మీలో వజను లేక పోవడంచేతే అందరిచేతా నాకీమాటలు.'

భార్య యొక్క వుపన్యాసాలకు సమాధానం తోచ లేదు కృష్ణారావుకు. బి. ఏ. ప్యాసైతే మాత్రం ఆ తెలివి తేటలు వస్తాయా? ఏ షేక్స్పియర్ మీదో, షెల్లీని గురించో లెక్చరైతే బనాయిస్తాడు నిరాఘాటంగా.

పద్మావతి ధోరణి ఎక్కువయిపోతున్నది. ముసలావిడ మీద తప్పిదాలెన్నో బయటకు వస్తున్నవి. ఇంట్లో అత్తా కోడళ్ళిద్దరకూ సహజంగా వాళ్ళ మనస్సులుమారిపోయి సహింపు కలగాలిగాని, తన హితోపదేశం పనిచేయదని కృష్ణమూర్తి తలంపు.

ఇక నక్కడ నిలవకుండా చివాలునలేచి ఉత్తరీయం పైన వేసుకొని బయలుదేరాడు. 'రమ్మని మా నాన్నకు వుత్తరం వ్రాయమన్నారా?' అన్న పద్మావతి ప్రశ్న అతడు

వినుపించుకోలేదు తిన్నగా నల్ల చెరువుకేసిపోయి ఒడ్డువిూద కూర్చున్నాడు.

సాయంసమయం. మెల్లగా వీస్తున్న పిల్లగాలికి చిన్న చిన్న అలలు లేస్తున్నై చెరువులో. అప్పుడప్పుడు నీటిపైకి తేలుతున్న చేపలకోసం రివ్వున పైనుంచి దిగుతున్నై పిట్టలు. కృష్ణుడు ఊహాప్రపంచంలో ఈదులాడుతున్నాడు.

'దానికి నా విూద ప్రేమ సున్నా. నా తలంపులన్నింటికీ విరుద్ధ ఫలితాలే కలుగుతూండడం నా దురదృష్టం. ఎన్నడూ అనుకోలేదు నా జీవితంలో ఇట్టి మనఃక్లేశాలకు పాలౌతానని.

'ప్రతి హిందూ గృహమూ అత్తాకోడళ్ళ వాగ్వాదంతో మారుమోగ వలసిందేనా? కొడుకువిూద తలికీ, భర్త విూద భార్యకూ ప్రేమవుండకుండా ఉంటుందా? ఉంటే ఎందుకు కలుగుతుంది ఈ గృహకల్లోలం?

'వెతికి వెతికి సౌందర్యరాశి అని పెండ్లి చేసుకున్నా దాన్ని. మనసారా ప్రేమిస్తున్నాను. దుఃఖమే నాకు మిగిలింది ప్రేమించే ఆత్మకు దుఃఖమేనా పరమావధి?

'ఇంతకూ కారణం ఎక్కువ సంపాదించలేని నా అసమర్థత అనుకుంటా. ఐతే ధనికుల ఇండ్లలో లేవా ఈకల్లోలాలు? అదీకాక ద్రవ్యానికీ సుఖానికీ సంబంధమేముంది కారణంలేదు. తన పెద్దరికం, 'అథార్టీ' చూపించాలని అడుగడుక్కీ తప్పులేరి చీవాట్లు పెడుతుంది అత్తగారు కోడల్ని. కోడలు మొదట కొంతసహించి ఊరుకున్నా చివరకు ఎదురు తిరిగి తీరుతుంది. వాళ్ళ వైరం సహజం—ఎలుకా పిల్లులకూ, పిల్లి కుక్కలకు మల్లే.'

ఒక బెస్తవాడు తన వలలోపడ్డ ఒకచేపను విసరి ఒడ్డుకు వేశాడు. కృష్ణమూర్తి సమీపాన పడి అది గిలగిలా తన్ను కుంటున్నది. నిద్రలో కలగని లేచినవాడు లాగా పులికిపడి నాల్గుదిక్కులూ చూచాడు ఒకసారి. సూర్యబింబం భూమి చాటుకు పోయింది. సాంధ్యరాగాలు మబ్బులలో ప్రతిఫలి స్తున్నవి. కృష్ణమూర్తి లేచి ఇంటివైపు సాగించాడు అడుగులు.

అతని ఊహాలు తెగలేదు. తలవంచుకొని ఆలోచిస్తూ నడుస్తున్నాడు. వీధుల్లో ఏమిన్నీ; కాఫీ హోటళ్ళలో గ్రామ ఫోను పాటలైనా, అతన్ని ఆకర్షించలేదు. అతను ఇంటికి చేరే సరికి బాగా చీకటి పడింది. అంతా అంధకారమే.

## 3

పద్మావతి పుట్టింటికిపోయి రెండునెలలైనా రాలేదు. పోయి తీసికొనివద్దామన్న వుద్దేశము కృష్ణమూర్తికి లేదు. ఆమెతండ్రి ఐనా తీసుకవచ్చి దిగబెట్టిపోలేదు. ముసలావిడ మాత్రం రోజూ కోడల్ని తీసుకరమ్మని పోరుతూనేవుంది. 'ఉన్నన్నాళ్లూ ఇద్దరకూ పడదు. ఇప్పుడు తానే తీసుకుని రమ్మంటుందేమో!' అనుకున్నాడు కృష్ణమూర్తి.

కృష్ణమూర్తిని ఆకర్షించేదేమీ పద్మావతిదగ్గర కను పించదు. చివరకు తల్లిపోరువల్లనే అత్తగారింటి పోయాడు. గుడివాడ తాలూకా ఆఫీసులో గుమాస్తా అతని మామగారు.

అల్లుడిమర్యాద సక్రమంగానే జరిగింది. అత్తగారింటికి వచ్చి మళ్ళీ వెంటనే వెళ్ళడం బాగుండదని రెండురోజులైన తర్వాత మూడోనాడు సాయంత్రం ఆరుగంటల బండికి

ప్రమాణమని చెప్తూ భార్యనుకూడా తీసుక వెళ్తానని పెళ్ళి బెట్టేడు.

అందుకు కృష్ణమూర్తి అత్తగారు సొంతు సవరించుకుని ఉపన్యాసం సాగించింది. వాళ్ళయింట్లో వ్యవహారాలన్నీ అసలు ఆవిడే నడ్డుతూంటుంది. కచేరీలో పనిచేసి ప్రతినెలా ఒకటో తారీఖున జీతంరాళ్ళు తెచ్చి తన చేతుల్లో పోసేటంత వరకే ఇంటాయన డ్యూటీ. ఇక ప్రతివిషయంలో ఆమే ముందడుగు వేస్తుంది. భర్తమాట సాగనియ్యదు. ఆయనకేమీ ప్రపంచజ్ఞానం లేదని ఆమె ఊహ. అది తెలిసి ఆయన సాధ్యమైనంత వరకు మౌనముద్రములోనే వుంటాడు. ఆమె ఎంత చెప్పితే అంత. కూర్చోమంటే కూర్చోటం. నిల్చోమంటే నిల్చోటం. గవర్నమెంటు వుద్యోగస్తుడైనా యింట్లో నౌకరు మాత్రుడే.

పద్మావతిని తీసుకవెళ్తానని కృష్ణమూర్తి అనగానే మామగారు మాట్లాడలేదు. అత్తగారే మొదలు పెట్టింది. 'అబ్బాయీ! నీవు ఎక్కువగా చదువుకున్నావు, మా అమ్మాయి సుఖపడుతుందని నీకిచ్చాము. పేగుతీసి నీమెళ్లో వేశామన్న మాట. ఇప్పటికైనా నీ తప్పేమీ లేదు. కాని మీ అమ్మదగ్గరమాత్రం మా అమ్మాయి కాపురం చేయలేదు. అంతా నీకు తెలిసే వుంటుంది. అల్లారుముద్దుగా పనీ, పాటా చెప్పకుండా పెంచుకున్న పిల్ల అది. పదిహేనేండ్లయినా పూర్తిగా నిండలేదు దానికి. ఆరళ్ళు పడలేదు మీ అమ్మను విడచి వేరే మీ యిద్దరూ వుంటే పిల్లను పంపటానికి మా అభ్యంతరం లేదు. కాదంటావా, ఇక్కడే మాతో వుండు,

ఈలోగా మీ మామగారు నీ వుద్యోగానికి ప్రయత్నిస్తుం టారు'

కృష్ణమూర్తికి కోపంవచ్చింది. తన తల్లినివిడిచి వేరే వుండాలా? అలా కాకపోతే వీళ్ళింట్లో అనాధలాగా పడి వుండాలా? అసంభవము. ఆత్మగౌరవంలేనివాడా కృష్ణ మూర్తి!

ఎంతో అవమానపడ్డట్టు సిగ్గుపడ్డాడు. కోపోద్రేకం కూడా కలిగింది. కాని అణచుకున్నాడు. ఎవరితోనూ ఎది రించి పోట్లాడే శక్తి లేదతనకి. పాపం, అమాయికపు నైతి కుడు.

వెంటనే అక్కడనుంచి లేచిపోయి ఒక గుఱ్ఱపు బండి మాట్లాడి తెచ్చాడు. బండివాడిచేత తనసూటుకేసు బండిలో పెట్టించాడు. తానుకూడా బండిలో ఎక్కుతూ చివరసారి అత్తగారింటివేపు చూచాడు. పద్మావతి గుమ్మందగ్గిర నిల్చొని చూస్తున్నది. అతని విశాలనేత్రాల్లో ఒక భయంకరమైన తెగువ వ్యక్తమౌతున్నది. పొడుగూ, పొట్టీకాని బలిష్ఠమైన అతని యౌవనాకారం ఆమె హృదయాంకితమై, ఆ ఛాయ ఆమె జీవితాంతంవరకూ మాసిపోలేదు.

జట్కా వీధిమలుపు దాటిపోయింది. గుఱ్ఱము మెడకు కట్టిన గజ్జెలమోత మాత్రం వినిపిస్తున్నది పద్మావతి గుమ్మం దగ్గిరే నిల్చొన్నది. గజ్జెలచప్పుడు తగ్గింది. సన్నపడి సన్నపడి వినుపించలేదు. పద్మావతి హృదయంలో మాత్రం మారు మోగుతూనే వున్న దాగజ్జెలమోత. లోపలికి పోయింది పద్మ. పగలు గడిచింది. చీకటి పడింది. ఆకాశాన నక్షత్రాలు మొలిచినై. పద్మ హృదయంలో ఏదో భయంగావుంది. గుండె

కొట్టుకుంటున్నది. కారణం ఆమెకే అవగాహనకాదు. ఆ రాత్రి పనుల్లో తల్లికి సాయపడలేదు. భోజనంకూడా మానేసింది.

పది పదిహేనురోజులు గడచినై. ఒకనాడు పద్మావతి తల్లితో గుంటూరుకు పోతానని చెప్పింది. ఆమె కోప్పడ్డది. పద్మ పట్టుపట్టింది. 'చూస్తూచూస్తూ అలాగైతే బావిలో దూకు' అంటూ విసుక్కుంది తల్లి.

పద్మావతి గుంటూరు చేరేసరికి కృష్ణారావు లేడు. పద్మావతి గుండెలు మరీకొట్టుకుంటున్నవి. వణుకుతూ సంగతంతా ముసలావిడతో చెప్పింది. ఇంటికి రాక కృష్ణుడు ఎక్కడకు పోయాడో? అత్తాకోడళ్ళిద్దరూ ఒకరి చేతుల్లో ఒకరు వాలి ఏడ్చారు.



# పెళ్లి చెడగొట్టిన అవధాని

౧

అత్తా ఆడబిడ్డల పోరుకంటే ఎక్కువైంది నాకు అవధాన్లపోరు. సిగరెట్టు ముట్టించనీడు, కాఫీ దేవాలయములో అడుగుపెట్టనీడు, క్రాఫింగు గొరిగించేసుకోమని రోజూ లెక్చర్లే. ఒకనాడు కాలేజీకి సూటు వేసికొని వెళ్ళేను. ఇంగ్లీషు క్లాసు ఐపోగానే అవధాని నాదగ్గరకువచ్చి 'ఎందుకబ్బాయీ! ఇవ్వాళ ఇల్లాగు తయారయ్యావూ?' అన్నాడు.

'ఏదో కాస్త కులాసా పుట్టిందిరా' అన్నాను.

'నీ ముఖం కులాసా! వెంటనే ఇంటికిపోయి ఈ వేషం మార్చి శుభ్రమైన ధోవతి కట్టుకురా పో' అని నెట్టేడు.

ఇంటికి పోయిందాకా పీక్కుతింటాడని నాకు తెలుసు. ఐనా 'ఇంటివద్ద ధోవతులు లేవురా. అన్నీ చాకలాడికి వేశా మొన్న' అని ఒకపుల్ల అడ్డంవేశా.

'ధోవతి లేకపోతే అంగవస్త్రం ఒకటి కట్టుకురా పో'

'అందరూ నవ్వరట్రా!'

'ఇప్పుడు నవ్వడం లేదటోయ్ నల్లదొరా!'

ఏంచెయ్యను! మళ్ళీ నోరెత్తకుండా ఇంటికి దారితీశా. ఆనాడు స్కూలుకువచ్చి ఎగగొట్టి పోయినందుకు రూపాయి జరిమానా వేశారు. ఇచ్చుకోక తప్పిందికాదు. 'డబ్బు పోతే పోయింది. చదువురాకపోతే నష్టంలేదు. నీ మతంమాత్రం జాగ్రత్తగా కాపాడుకో' అని అవధాన్లు సమాధానం చెప్పేడు.

ఈవిధంగా నా స్నేహితుడు నన్ను చంపుకతింటున్నాడు, తన అధికారమంతా నామీద చలాయించుకుంటూ. ఏమి కారణమో తెలియదుగాని నేనతన్ని ఎదిరించలేకుండా వున్నాను.

రోజూ స్కూల్లో బైబిల్ టీచరుకూ మావాడికీ హోరాహోరి పోరాటం జరుగుతూంటుంది. ఆయనంటాడుగదా 'మా యేసుక్రీస్తేనయ్యా, ప్రపంచానికంతకూ మోక్ష మివ్వగల జగద్గురువు' అని. దానితో అవధానికి ఒళ్ళు మండిపోయి 'అది సర్వాబద్ధం. అల్లాగైతే మీ యేసుక్రీస్తుకు మోక్షమిచ్చి నాయన ఎవరు?' అని అడ్డుప్రశ్న వేస్తాడు. ఇక వాళ్ళిద్దరకూ గంటకొట్టేవరకూ వాగ్యుద్ధం; మాకందరకూ వింటానికి బహు తమాషాగా వుండేది.

మొత్తంమీద మావాణ్ణిగురించి నేను చెప్పదలచిందేమంటే, అతడు సనాతన హిందూ మతావలంబి. మిగిలిన మతాలన్నీ చిల్లరవని అతని వాదన. తన వుద్దేశాలను ఎవరూ ఖండించరాదు. ముఖ్యముగా తాను హిందూమతోద్ధరణకు పుట్టినట్టు భావించుకుంటాడు.

నేను హిందూమతానికి చెందినా, నామతాన్ని గురించి నాకంత 'కన్సర్వేటివ్' అభిప్రాయాలు లేవు. నాకసలు ఏ మతంలోనూ నమ్మకంలేదు. మతమంటే మనదగ్గర్నుంచి సత్య స్వరూపం దగ్గరకు వేయబడ్డ రోడ్డు. ఈ మతాలన్నీ అనేక దారులు. అవన్నీ నిజంగా ఆ సత్యస్వరూపం దగ్గరకు దారి తీస్తాయో, లేక యే గోతిలోనైనా దింపుతాయో మనకు తెలీదు. "మనకు తెలియకపోతేనేం, ఆ యా మతస్థాపకుల అనుభవమే మనకు నిదర్శనం' అంటారు. కాని ఆ మతస్థాపకులైనా సత్యాన్ని పూర్తిగా గుర్తెరిగినవారేనా అని నా ప్రశ్న.

వాళ్ళు పూర్తిగా పరమావధినిచేరుకున్న వాళ్ళయితే వారిచే స్థాపించబడిన మతమే ప్రపంచాన్నంతా తన పిడికిలిలోకి తీసికునేది. అలాకాకుండా ఇన్ని మతాలు ప్రపంచంలో ప్రబలిపోయిన కారణంచేతనే ఏమతమూకూడా సత్యస్వరూపానికి దారికాదని తేలుతున్నది. వీటన్నిటినీ మించి సర్వోత్కృష్టమైన ఒక్కటే మతానికి మనమందరమూ చెందియున్నాము. ఇప్పటికీ భిన్న మతస్థులమైనా మనందరకూ ఆ సత్యమే పరమావధి. అందుచేత ఏనాటికైనా భిన్నాభిప్రాయాలు నశించి ప్రపంచమంతా ఒక్కటే జెండా కింద ఏకము కాగలదని నాకు పూర్తి నమ్మకంవుంది. కనుక నా కీబాహ్యాచారాలమీద నమ్మకంలేదు. అస్పృశ్యత నమ్మను. మతాంతరులతో సంబంధము నాకిష్టమే. అందుచేతనే క్రీస్తుమతానికి చెందిన సుందరంగారి కూతురు మీదికి నామనస్సుపోయింది.

౨

కళ్యాణీబాయి మాతోకూడా మొన్న బి. ఏ. పరీక్షకు కూర్చున్నది. ఆమె నిజంగా చాల అందగత్తె. ఆ సౌందర్యాన్ని మాటల్లో ఇముడ్చటం కష్టం ఆమె కన్నులు విశాలంగావుండి చెవులకేసి పరుగెత్తుతూంటవనీ, జడ పొడుగ్గా నల్లత్రాచువలె వేలాడుతూ పిరుదులమీద నాట్యం చేస్తూంటుందనీ, ఉన్నత వక్షోభాగం సన్ననడుముమీద మనోహరంగా ఆధారపడి వుంటుందనీ, పెదవులు దొండపండువలె ఎర్రగాచూస్తే ముద్దెట్టుకోవాలనిపిస్తుందనీ నేను చెపితే మీరు విని గుటకలు మింగేకంటే ఒకసారి మీరు మావూరువచ్చి ఆ దేవతాసందర్శనం చేసికొనిపోతే తీర్థయాత్రాఫలం కలుగుతుంది. ఆమె క్లాసులో

చంద్రబింబంలాగా వెల్తురు చిమ్మేస్తుండేది. నా కండ్లెప్పుడూ అటు కేసే వుండేవి, చెప్పద్దూ. టీచరు పాఠాలు చెపుతూవున్నప్పుడు ఆమె టేబిల్ మీాదికి వంగికూర్చుని నోట్సురాసుకుంటూంటే అప్పుడప్పుడు పైట జారిపోతూవుండేది. మళ్ళీ సర్దుకుంటూ వుండేది.

ఆ అమ్మాయిని పెండ్లిచేసుకుందామని నాకెంతైనా కులాసాగావుంది. ఎందుచేతనంటే — చదువుకున్న పిల్ల, మంచి అందంగలది. ఏ ఎడ్డిదాన్నో కట్టుకుంటే జీవితమాధుర్యమేమి ఆస్వాదించగలం?

ఈ ఉద్దేశంతోనే అనేకసార్లు కళ్యాణితో మాటలు కదిపేను. పుస్తకమనీ, అదనీ వంకపెట్టుకుని వాళ్ళింటికి చాల సార్లు పోయ్యాను. సుందరంగారు కూడా చాలవరకు పరిచయమయ్యారు.

ఆనాడు సాయంత్రం సుందరంగారింటికిపోయి రెండు మూాడుగంటలు కులాసాగా గడపి వద్దామని 'ప్లాను' వేశాను. అందుకోసం బాగా ముస్తాబవాలిగా!... మొదటిపని 'సేఫ్టీ రేజరు' తెచ్చి సబ్బురాసి గడ్డంచేసుకోవడం మొదలుపెట్టేను. కుడివేపుపని పూర్తి అయింది. ఇంతలో తలెత్తి చూాద్దును గదా! ఎదురుగా నిలబడి వున్నాడు వినాయకుడులాగా మా అవధాన్లు. నా గుండెల్లో రాయిపడ్డది. చేతులో 'రేజరు' లాక్కున్నాడంటే ఈ సగం గొరిగిన గడ్డంతో నలుగురులోకి పోయే ఇది వుండదు. నన్ను చూాచే చూాడ్డంతోనే అందుకున్నాడు.

'ఎక్కడ పుట్టేర్రా మీ వెధవలంతా? గొరుక్కోవ డానికి వేళాపాళా లేదూ? అమావాస్యగానీ, భోజనాత్పూర్వం గానీ, రాత్రిగానీ...'

'అదికాదు అవధానీ! నీవే చెప్పేవుగా ఒకసారి నాకు: నటకులకూ, జైల్లోనుంచివచ్చిన వాళ్ళకూ క్షవరవిషయములో తిథులపట్టింపు వుండదని. అలాగే నిరుద్యోగులు ఉద్యోగం నిమిత్తం పైఅధికారులను చూడబోయేటప్పుడుకూడా క్షవ రానికి ముహూర్తం వెతుక్కోనక్కరలేదు అనే 'ఎమెండు మెంటు' పెట్టుదామనుకున్నా. అది నీ వంగీకరింపకపోవని తలచాను.

'వెధవ ఎమెండు మెంటు లన్నీ పనికిరావోయినాయనా!'

'ఎల్లాగు చెప్పుమరి. మా బామ్మనాకు పెండ్లి చేసె యాలని పట్టు పట్టింది. ఇక ఆగేటందుకు వీల్లేదుట. నా ప్రవర్తన విషయంలో ఆమెకేదో అనుమానం తోచినట్లుంది. ఆ ముసలిదానిపట్టు ఎల్లాంటిదో నీవు ఎరుగుదువుకదా. ఏ పిల్లనో తెచ్చి, మెడకు కట్టేస్తుంది. ఆ అమ్మగారు కాపురానికి వచ్చేలోపుగా ఏదైనా వుద్యోగంలో వుంటే మర్యాద దక్కు తుంది గాని లేకపోతే భార్యకు కూడా చులకనై పోవాలిసి వస్తుంది. ఎరుగుదువుకదా సుమతీ శతకంలో కందం? 'గడన గల మగని' జూచిన...

'అయితే ఇప్పుడు నీకు ఉద్యోగం ఎవరిస్తానంటున్నా రోయ్, పిచ్చినాన్నా'

'ఉండుమరి, చెప్పనీ; దొరగారి పుగాకు కంపెనీలో ఏదో ఖాళీవుందని తెలిసింది. ఆయనగారిని చూడబోతు న్నా నిప్పుడు. మాసిన గడ్డంతో పోతే__అందులో దొరదగ్గ

రకు— బాగుంటుందా చెప్పు? అందుకనే నేనే తంటాలు పడు తున్నా రేజరుతో.'

'హరహరా! బి. ఏ. చదివి పుగాకు కంపెనీలో పని చేయడమా చివరకు.'

'అది నాకంత గౌరవహానిగా తోచడం లేదు. కాని ఒక్క అనుమానంవుంది. ఏమంటే బ్రాహ్మణులకు పుగాకు నిషేధవస్తువుగదా! ఆ ఆఫీసులో నాకు పనిదొరికితే ఎప్పుడూ ఘాటుగల పుగాకు వాసనలోనే వుండవలసి వస్తుంది. కనుక మన మతవిషయికంగా ఈ వుద్యోగం స్వీకరించడమా? ఊరు కోవడమా? ఆ సమస్య నీవే పరిష్కరించాలి'

'వాసనే గనుక పరవా లేదు లే. శాస్త్రిగార్లు, పండితులూ నశ్యరూపేణా పుగాకును ఆస్వాదిస్తూనే ఉంటారు. సరే, దొర దగ్గరకు వెళ్ళిరా. నేనుపోతా. ఇకనెప్పుడూ మాత్రం అకా లంలో క్షవరం చేసికోకు. ఇంకోసంగతి: ఒకవేళ పుగాకుకంపె నీలో ఉద్యోగం దొరికినట్టాయనా అవకాశం దొరికిందిగదా అని, సిగరెట్టుఖర్చు లేకుండా పోతుందని, అక్కడ తేరగా పడుండేపుగాకును చుట్టలు చుట్టి తగలేయకు సుమా.'

'ఎబ్బే. లేదు. లేదు.'

వినాయకావధాని వెళ్ళిపొయ్యాడు; ఆధునిక పద్ధతు లమీద నా ముస్తాబు తయారైంది.

సుందరంగారు ఊళ్ళో పేరుపడ్డ డాక్టరు. ధనాశ ఎక్కు వగా లేనందుచేత బీదలకుకూడా అందుబాటులో వుంటాడు. అందరకు మల్లే తలనొప్పికి కూడా 'ఇంజక్షన్' చేయడు కనుక 'ప్రాక్టీసు' జాస్తిగావుంది; మంచి పలుకుబడి వుంది.

నేను వాళ్ళింటి ముందుకు పోయేసరికి హాల్లోకూర్చుని యున్న తండ్రీ, కూతూరూ నా దృక్పథంలో పడ్డారు. 'హాలో కమాన్' అంటూ సుందరంగారు ఆహ్వానించారు. కళ్యాణి సహజమందస్మితంచేత గౌరవింపబడ్డాను. తిన్నగా బూటు కాళ్ళతో గచ్చునేలమీద టకటకా చప్పుడు చేసుకుంటూ సరాసరి హాల్లోకిపోయి ఒక కుర్చీ కళ్యాణి దగ్గరగా లాక్కొని కూర్చున్నాను కొంతసేపటి వరకూ మా సంభాషణ మొన్న మొన్ననే ముసిగిన పరీక్షలను గురించి జరిగింది. తరువాత సుందరం గారు కళ్యాణి భావిపరిస్థితులను గూర్చి కొంచెముగా ముచ్చటించారు. ఎం. ఏ. క్లాసుచదివించడమా, లేక యే 'ప్రొబేషనరీ డిప్యూటీ ఇన్స్పెక్ట్రెస్ ఆఫ్ గరల్సు రేంజి' ఉద్యోగాన్నికైనా ప్రయిత్నించడమా అని ఆలోచించారు. నేను మాత్రం కళ్యాణిని ఏ ఉద్యోగంలోనూ ప్రవేశపెట్టకండని సలహా యిచ్చాను. ఎందుచేతనంటే ఉద్యోగ సంబంధమైన లాయిలాసాలకు శిరీషకుసుమకోమలమైన ఆమెశరీరం తగింది కాదన్నాను.

ఇంతలో కళ్యాణి 'టీ'తో నింపబడిన ఒక కప్పు సాసర్ నాముందు పెట్టింది. అప్పుడామె ముంజేతిమీది గాజులు కొద్దిగా చప్పుడు చేసినై. ఆ ధ్వని నా హృదయంలో తీయని సంగీతంగా మారోమ్రోగింది.

'టీ' రెండుమూడు గుక్కలు తాగి తలెత్తి చూద్దును గదా! ఎవరో ఒకముసలాయన తలగుడ్డచుట్టుకుని తిన్నగాలో పలకు వచ్చేస్తున్నాడు. వచ్చి సుందరంగారికి ఒకసలాంపారేశి, టేబిల్ దగ్గర కుర్చీలో కూలబడ్డాడు. ఇంతసేపునుంచీ సోఫాలో పడుకునివున్న సుందరంగారు లేచి కూర్చున్నారు. నూతనపురు

షుడు ఒక్కసారి నాకేసి తీక్ష్ణంగా చూచి, డాక్టరుగారికేసి తిరిగి 'అయ్యా! నాపేరు ఏకదంతశర్మ; మీదర్శనానికే వచ్చాను; శుద్ధి యుద్యమంలో పనిచేస్తుంటాను' అన్నాడు.

సుందరంగారు ఆయనకేసి కొంచెం పరీక్షిస్తున్నట్టుగా అవలోకించి: 'శుద్ధి యుద్యమమా! ఔను విన్నాను. ఈ మధ్య తద్విషయికములైన వ్యాసాలు కొన్ని పత్రికల్లో చదివేను. ఒకాయన 'శుద్ధియుద్యమ తత్వము' అనే శీర్షికకింద కొన్ని వ్యాసాలు రాస్తూ ఒకదానిలో 'స్త్రీల ఆకర్షణ' అనే ఉపశీర్షిక తగిలించి, క్రీస్తు మిషనరీలు క్రైస్తవ స్త్రీలను ప్రచారకురాండ్రుగ తయారుచేసి పురుషులను ఆకర్షిస్తున్నారని రాశారు. ఆధారములేని అట్టి రాతతో క్రైస్తవ స్త్రీల సౌశీల్యానికి కళంక మాపాదించారు' అన్నారు.

'ఎవరో బాధ్యతలేని వాళ్ళ రాతలకు మేము సమాధాన్యం చెప్పుకో నవసరంలేదు. కాని మిషనరీలు హిందూ సంఘానికి పెద్ద అపకారం చేస్తున్నారన్నమాట ఒప్పుకొని తీరాలి' అన్నాడు ముసలాయన.

'ఎందుచేత నండీ బాబు! మీ చేత నిరసింపబడి బహిష్కరింపబడిన ఒకజాతిని ఉద్ధరించారనా?'

'ఉద్ధరించలేదు. మతభ్రష్టులు చేసి మోక్షానికి దూరంగా చేశారు.'

'బాగా ఆలోచించండి. మీ మతం విడచి క్రైస్తవ మతంలో చేరినవాళ్ళు చాలమంది మీ చేత పంచములూ, ఛండాలురూ అని పిలువబడినవాళ్ళు. వాళ్ళు మీ మతంలో ఉండి ఏమిసుఖం అనుభవించారు? వాళ్ళను మీరు కుక్కలూ, పందులూ మొదలైన నీచ జంతువులకంటే అసహ్యంగా

చూచారు. అంటరానివాళ్ళని ఇరుగు పొరుగునుంచి తోలేశారు. వాళ్ళ అభివృద్ధికి మీరేమీ పాటుపడ్డట్టులేనే లేదు. వాళ్ళకని మీ రేర్పరచిన పాఠశాలలేమీ లేవు. మీ మత రహస్యాలు తెలుసుకో గలిగినంత బుద్ధివికాసం కలుగజేయలేదు. వాళ్ళకు పైగా మీ మతగ్రంథాలు వాళ్ళు వినకూడదనికూడా శాసించారు. ఈ విధంగా మీచేత నిరసింపబడి ఊరిచివర గుడిసెలు వేసుకొని అర్ధాన్నంతో మలమల మాడుతూ రోదిస్తున్నారు. ఎప్పుడైనా మీ ఎంగిలి కూటికి కూడా ఆసించి మీయిండ్ల ముంగలికి వస్తే 'ఛీ అవతలకు పొండ'ని తరిమేస్తున్నారు. దైన్య మావరించిన ముఖాలతో, డొక్కలు కంటుకుపోయి, పొట్టలతో మాలగూడేల్లో వున్న వీళ్ళవద్దకు పోయిన 'మీరంతా అధైర్యపడి నిరాశపడవద్దు. రండి, మా యేసు క్రీస్తు మిమ్మల్ని రక్షిస్తాడు' అని చేతులు చాచి పిలిచారు మిషనరీలు. వాళ్ళకొరకు కాలేజీలు పెట్టేరు, ఆసుపత్రులు నిర్మించారు, ముక్తికి ఆధారమైన భుక్తి కల్పించారు. నేడు అనేకమంది పంచములు విద్యాధికులై ఉన్నారంటే అదంతా మిషనరీల ప్రసాదం.

'అంత విలువగల మానవసేవ చేశారంటే ఉత్కృష్టమైన పని. కాని అది వాళ్ళను మతభ్రష్టులను చేయకుండా సాగించవలసింది'

'హిందూమతంలో వుండిమాత్రం వాళ్ళు ఆధ్యాత్మికాభివృద్ధి ఏమి పొందగలుగుతారు, మీ దేవాలయాల్లోకి వాళ్ళను రానీయక పోయింతర్వాత, మీమతగ్రంథాలు వాళ్లు వినగూడనప్పుడు?

'అదీకాక—ఇప్పుడు మీరు మంత్రజలంతో శుద్ధిచేసే ఈ క్రైస్తవులను మీ ఆర్య సమాజంలో కదా కలుపుకుంటారు? అందుకు అంగీకారం లేని సనాతనులు వాళ్ళకు 'సంకర జాతి' అనే పేరుపెట్టి, ఆరోకులం ఒకటి కల్పిస్తారు. మీరు తలపెట్టిన ఉద్యమం మంచిది కాదనను. కాని అది కొనసాగాలంటే మీ ప్రతిహిందువుడూ తన తోడ్పాటు ఇవ్వాలి. ఆర్య, బ్రహ్మ మొదలైన సమాజాలతో హిందూమతం ఛిన్నాభిన్నమై పోతూవుంటే ఈ శుద్ధియుద్యమం మీకు మరీ చెరుపు తెస్తుంది. కనుక ముందుగా మీలో మీకున్న ద్వేషాలూ, కక్షలూ మానేసికొని ఒకటే సంఘామీద నిలబడివున్నప్పుడు మీ శుద్ధి యుద్యమము ఉన్నతాదర్శాలతో సాగించండి'

'ఈ మాటలతో ఆముసలాయనకు కోపంవచ్చినట్లుంది. ఏదో మాట్లాడబోయ్యాడు గాని మళ్ళీ శాంతంవహించి ఎందుకో మీసం కుడిపక్క సవరించుకున్నాడు. నాకు అనుమానం వేసింది. అది అతికించుకున్న మీసం లాగుందే !

ఏకదంతశర్మగారు సుందరంగారి దగ్గర సెలవు తీసికుని వెళ్లిపోయాడు. నాకు కలిగిన అనుమానంచేత ఆయనెవరో తెలుసుకుందామనుకుని నేనూ బైటకు వచ్చేశాను, చిరునవ్వుతో కళ్యాణిని సెలవడిగి.

రోడ్డుమలుపు తిరగ్గానే ఆయన్ను కలుసుకున్నాను. నాకు చిరపరిచితుడువలె నా భుజముమీద చెయివేసి 'సుందరంగారు మంచి గట్టివాడు సుమా!' అన్నాడు.

'ఆయన కూతురుమాత్రం పనసతొనలాంటిది మీరు చూచారుగా' అని నేనన్నాను.

'ఓహో, ఆ పనసతొనకోసమేగా నీ విక్కడికివచ్చింది! నాకు తెలుసునురా మీలాంటి వెధవన్నల వుద్దేశాలూ. పుగాకు దొరదగ్గరకు పోతానన్నావుగదూ' అంటూ తలగుడ్డ తీసివేసి మీసం ఊడబెరికేశాడు. మా అవధాన్లే నాముందు నిలబడివున్నాడు. ఇంటికి వచ్చింతర్వాత సంగతంతా మా బామ్మతో చెప్పి ఆమెచేత చీవాట్లు వేయించాడు. తానూ ఒకపెద్ద 'లెక్చె'రిచ్చేశాడు.

నాటినుంచి ఇప్పటివరకూ మళ్లీ సుందరం గారింటికి ఎప్పుడు సందుదొరికితే పోతానో అని కాపలా కాస్తునే ఉన్నాడు, పడుచుభార్యను అనుమానించే ముసలిమగడువలె.



# మాష్టర్ జీ!

చిట్టమధ్యాహ్నమప్పుడు ఎర్రటెండలలో ఆ పేటనించి ఈ పేటకు ఎలా వచ్చాడా అనుకున్నాను. కాని.., రాకేం జేస్తాడు? రాణీగారి ఆజ్ఞ: తొమ్మిదో నెల; నీళ్ళాడేందుకు పుట్టింటికి వెడుతుంది. మర్నాడు; బజారుకుపోయి ఒకటో, రెండో మంచిచీరలు, పుట్టబోయే కుర్రాడికి క్యూటికూర పౌడరు డబ్బాలు, ఖరీదుగల సబ్బిళ్ళలు, పట్టుకు రమ్మందట.

ఎన్ని తమాషాలు లోకంలో! ఒకప్పుడు భార్యను నీచంగా చూచినవాడు...ఆమెను వాళ్ళపల్లెటూళ్ళో వొది లేసి...అక్కడ అత్తా మామలకు చాకిరి చేసుకుంటూ విధి రాత అనుకుని అఘోరిస్తూంటే...తాను ఒంటరిగా ఎక్కడో ఉంటూ, సంపాదించే డబ్బు కాస్తా కాఫీలకు, సిగరెట్లకూ ధ్వంసంచేస్తూ, స్వేచ్ఛగా సంచరించినవాడు...ఇవాళ ఆమె గీచిన గీటు దాటటంలేదు.

ఆరోజుల్లో...నాలుగైదు సంవత్సరాలకింద...ఒకసారి అడిగాను; 'ఏమోయి శ్రీహరిరావూ! నీ భార్యను ఎందుకు తెచ్చుకోవూ?' 'మనకు చాలినంత సంపాదన ఏమి ఏడిసిందనీ?'

కాని ఇది సరైన సమాధానంకాదు. ఏ చిన్నయిల్లో అద్దెకు తీసుకుంటే, తనకూ, భార్యకూ చంటివాడికీ సరిపో నంత మరీ స్వల్ప-ఆర్జనేమీ కాదు వాడిది. అదీ కాక—'నీ భార్యను నువ్వు ఏలుకుంటే ... విజయవాడలోనే కాదు ఢిల్లీలో మీరు కాపురమున్నా...అయ్యే ఖర్చులు మేం భరాయించుకుంటాం' అని తండ్రీ మామగారూ - ఇద్దరూ కాళ్ళు గడ్డం పట్టుకు బతిమాలారు. కాని అతను వింటేనా?

ఒకసారి ఆమెను విజయవాడ తీసుకొచ్చి అతనిగదిలో దిగబెట్టి వెళ్ళారు. కాని మరునాడే ఆమెనూ, పిల్లల్నీ కారెక్కించి పంపించేశాడు. స్నేహితులు ముక్కచీవాట్లు పెట్టారు. కాని అతను మారే స్థితిలో లేడప్పుడు.

భార్య అంటే అంత చిరాకు పడతాడు; అతని మనస్తత్వం ఏమిటో తెలుసుకోవాలని ఎంత ప్రయత్నించినా అంతుపట్టలేదు. సరైన సమాధానం చెప్పడుగా! అసమర్థుడనుకుందామా? కార్యమైన మొదాదిలోనే పిల్లాణ్ణి లాగాడే మరి!

ఒక వేళ ఆవిడలోనే లోపమేదైనా వుందేమోనని నేననుమానించానప్పుడు. కాని ఈ రెండు సంవత్సరాల్నించీ చూస్తున్నానుగదా ... అలా అనుకున్నందుకు నేనిప్పుడు పశ్చాత్తాప పడుతున్నాను. ఆమె ఆ యింటికి లక్ష్మి. ఆమె వల్లనే మనవాడికి శోభ. అలాంటి యిల్లాల్ని మూడేళ్ళు ఏడిపించాడు వాడు.

ఆమె కొనుక్కురమ్మన్నవీ ... ఇంకా మావాడు మోజుపడి కొన్నవీ...అన్నీ తీసికొని వెళ్ళాం. ఆమె కాఫీ కాచి యిచ్చింది. తాగాం.

మేం తెచ్చిన వస్తువుల్లో ఒక పొరపాటు జరిగింది. మావాడు కొడుకోసం ఒక చెప్పుల జత కొన్నాడు: అవి ఆమె చేతిలో ఎత్తి పట్టుకు చూస్తూ ఒక టేనవ్వు...

'అయ్యో, నా బొందా! ఏం తెలివితేటలండీ! ఈ చెప్పులు వాడికి సరిపోతయ్యా అసలు?'

'నువ్విచ్చిన కొలతప్రకారమే తీసుకొచ్చానే' శ్రీహరిరావు నీళ్ళు నమిలాడు.

‘ఆ పుల్ల కాస్తా దానిలో పళ్ళకింద పెట్టి చివరలు కొరికేసి ఉంటాడు’ ఆమె పకపకా నవ్వింది. శ్రీహరిరావు ముఖం చిన్నబుచ్చుకున్నాడు. ఆమె అంతటితో ఊరుకుందా? పక్కింటి ఆవిడకూడా తన మొగుడి తెలివితేటలు గలగలా చాటించి వచ్చింది.

నాలుగేళ్ళ కింద ఈమె కీసంతోషం, ఇంత అధికారం ఉన్నాయా?...అనుకున్నా నేను.

మళ్ళీ వెళ్ళి చెప్పులు వహాప్పుకొచ్చాం.

‘అన్నగారూ! మీరివాళ ఇక్కడే భోజనం. రేపు వెళ్ళిపోతున్నామండీ. మావార్ని కాస్త కనిపెడుతూ ఉండండి’ అన్నదామె నన్నుద్దేశించి వికసించిన ముఖంతో.

నేను మా వాడికేసి తిరిగి నవ్వాను.

నే నేదో పనుండి ఆ పేట వెళ్ళాను. ఆ రాత్రి అక్కడే నిలిపేశాడు. శ్రీహరి నన్ను-హోటల్లో భోంచేసి ఇంటికి వెళ్ళాం. తలుపు తాళాం తీసి లోపలికి అడుగువేస్తూ అతనన్నాడు; ‘అబ్బ! ఇల్లంతా బావురు మంటోంది...ఏమీ తోచదు...కడుపులో ఎల్లాగో వుంటోంది మరీను ..ఇన్నాళ్ళ నుంచీ...’

ఆమె వెళ్ళి సరిగ్గా ఇరవై రోజు లయిందో లేదో... అప్పుడే ఎలా ఇదౌతున్నాడో! నాలుగేళ్ళకింద లేని ఈ బాధంతా ఇప్పుడెక్కణ్ణించి వచ్చింది?

వెళ్ళి డాబామీద పక్కలు వేసుకు పడుకున్నాం ఇద్దరమూ,

ఆమె వెళ్ళాక ఒకటో రెండో మాత్రమే ఉత్తరాలు వచ్చాయిట. వారం పదిరోజులనించీ మళ్ళీ కబురు లేదుట.

నే నన్నాను: 'నీళ్లాడే పొద్దులాయెను; ఆ శుభవార్త మోసుకొని ఒకసారే వొస్తుంది ఉత్తరం. ఆదుర్దా పడతావేం?'

'అదికాదు. ఇక్కడున్నప్పుడే రెండుసార్లు జ్వరం పడ్డది. అక్కడికి వెళ్లాక డాక్టరుకు ఓ సారి చూపించుకోమని వెళ్లేటప్పుడు చెప్పాను. ఉత్తరమూ వ్రాశాను. ఎలా ఉందునో అని!'

ఒకప్పుడు భార్య కంటియెదుట కనిపిస్తే రుసరుసలాడిన వాడినోట ఇవాళ ఎలాటి మాటలు వస్తున్నాయో!

ఇటువంటి ఆశ్చర్యకరమైన మార్పు అతనిలో ఎలా వచ్చిందో అతని నోటినుంచే వినాలని ఎన్నాళ్లనుంచో కుతూహలంగా ఉండికూడా ప్రయోజనం లేకపోయింది. అడిగినా చెబుతాడని నాకు నమ్మకం కుదరలేదు. అయినా వాళ్లిద్దరూ కులసాగా ఉంటున్నారు; అంతే చాలనుకున్నా.

అది వసంతశర్వరి యేమో చాలా హాయిగా ఉంది. ఏ విస్మృతసుఖోపవనాల్లోనించో వీస్తున్నట్లుగా ఉంది చల్లని గాలి. తన పక్కమీద వెల్లికలా పడుకుని శ్రీహరి... వెన్నెల వెలుగులో ప్రశాంత నిర్మలమై...మానవ హృదయంలో మధురస్మృతిచిహ్నాలవలె నక్షత్రాలు తళుకుమంటోన్న... ఆకాశంకేసి చూస్తూవున్నాను.

'నేనొకటి అడుగుతాను దాచకుండా చెబుతావ్రటా?'

ఆకస్మికంగా వచ్చిన ఆతని ప్రశ్నకు నేను కొంచెం ఆలోచించి ఇలా అన్నాను.

'నీకుమల్లే నా గుండెలో నా స్నేహితులు చూడరాని రహస్యపు మూలాలు ఉండవే!'

అదిగో ఆకాశాన ఆ నక్షత్రాలవలే ప్రతిరాత్రీ తళుకు మంటూవుండే సుఖ దినాలు జీవితంలో నీకు భగవంతుడు ఎప్పుడేనా ప్రసాదించాడా?

'ఊహుఁ లేదు' అని వెంటనే అనేశాను.

నా జీవిత మంతా అదోలాంటిది. తల్లి దండ్రుల నైతిక ధర్మాలకూ, ఆర్య ధర్మాలకూ బానిస నైపోయి, హృదయం మాటికి మాటికీ కోరుతూవుండే సుఖాలనుంచి ముఖం తిప్పేసుకుంటూ వచ్చాను. చివరకు నాసంగతి ఎలాఉండే దంటే—అటు కాంగ్రెసు వాదినికాదు...కమ్యూనిష్టునీకాదు.

శ్రీహరి సిగరెట్టు వెలిగించాడు, రెండు వేళ్ల మధ్యనించి అగ్గిపుల్ల పారచిమ్మి.

'ఈ విషయం నీకు నే నెప్పుడూ చెప్పలేదు. నేను హైదరాబాదులో ఉంటోన్నప్పుడు...'

అంటే...అతని కార్యం అయిన అయిదారునెల్లకు అప్పుడు భార్యకడుపుతో ఉంది, తనేమో ఉద్యోగం చూచు కుంటానని ఎక్కడికో వెళ్లాడు.

ఆ వెళ్లినవాడు సంవత్సరంన్నరవరకూ అంతూపొంతూ లేడు. చివరకు మేనమామ ఎక్కడో చిక్కించుకు తీసు కొచ్చాడు.

నాకు కుతూహలం కలిగింది, 'ఊఁ' కొడుతూ పడు కున్నా. అత నిలా చెప్పాడు.

ఉద్యోగం యాచించటాని కంటూ వెడితే యింజనీరు గారింట్లో ఆయన పిల్లలకు ట్యూషన్ మాష్టరుగా కుదరాల్సి వచ్చింది. ఖాళీ రాగానే ఎక్కడైనా ఇరికిస్తానని గట్టిగా చెప్పాడాయె.

నాలుగురోజులయాక నన్నుకూడా వాళ్ళింట్లోనే వచ్చి ఉండమన్నాడు; బలవంతం చేశాడు; తప్పలేదు. పసిపిల్లలు వృద్ధిలోకి రావాలంటే నన్ను విడిచి పెట్టకూడదని ఆయనకు నమ్మకం చిక్కింది.

ఆయన మంచిభోగి, కావలసినంత ఆర్జనఉంది. లంకంత యిల్లు. చుట్టూతోట నాకొక గది ఇచ్చారు. ఉండటానికి వాళ్ళతోటే భోజనం. మొదటమొగాఉన్నా అలవాటు పడ్డాను నిమ్మదిగా. ఆడవాళ్ళుకూడా చాలమంచివాళ్ళు—మర్యాదస్తులు.

వాళ్ళింట్లో ఖర్చుచేసు విలువకడితే నా వంటివాడి ఒక కుటుంబానికి నూరేళ్ళగ్రాసం వొస్తుంది. 'బేబీ ఆస్టిన్' కారు ఒకటిఉంది. వంటవాడొకడున్నాడు. నేనొక్కణ్ణి. ఇంకా ఆయన మరదలొకతె ఆయిదేళ్ళకుర్రాడితో భర్తపోయి నప్పటనుంచీ అక్కగారి దగ్గిరే ఉంటోంది.

ఛాయాదేవి వితంతువని నాకు చాలారోజులవరకూ తెలీలేదు. జీవితంలో ఒకలోటు అనుభవిస్తున్నట్లుగా ఆమె కనిపించేదేకాదు. కలకలా నవ్వుతూ, చలాకిగా ఇంటిపనులు సవరిస్తూ, ఆడుతూ, పాడుచూ, చిలకలా ఉండేది ఇంట్లో. నిత్యసంతోషం నిత్యసంతృప్తి నేను ఆమెలోనే చూచాను. ఆ ఉల్లాసం, ఆ మాటల చాతుర్యం ఆమెకేతగు; ఆమె నవ్వితే ఎంతో సహజంగా ఉండేది; ఆ నవ్వువింటే శరీరరుగ్మతలు పోతాయని నేను గట్టిగా చెప్పగలను.

పురుషస్పర్శకు మొగంవాచి, నిగ్రహంలేక, నన్నామె రంగంలో దింపటానికి ప్రయత్నిచిందని నేనొక్క నాటికీ అన లేను. అనను. చివరకు నా కౌగిలలో పసిపిల్లవలే అయినప్పుడు

కూడా ఆమెలోనించి వాత్సల్యాన్నీ ధుశే పొంగి నన్ను చుస్తేసు కున్నట్టు అనుభవించాను ఆమె నాకంటే రెండు మూడేళ్లు పెద్దదే అనుకుంటాను.

నాకు సరీగ్గా భోంచేయటం చాతగాదని కోప్పడేది. పిల్లల్ని ముందేసుకుని వాగుతుండేది-'ఇకచాల్లెండీ, మాస్టర్ జీ! మరీ చదువెక్కువైతే పిల్లలకు అజీర్ణం చేస్తుంది. ఏదైనట్టుంది. కాస్త షికారు వెళ్లిరండి' అని ఆజ్ఞాపించేది.

నా సౌకర్యాలన్నీ ఆమె స్వయంగా చూచేది. తరచు మధ్యాహ్నమప్పుడు నాగదిలోకి వచ్చి కులాసాగా కబుర్లు చెప్పి వెళ్ళుతుండేది.

'ఏం మాస్టరుగారో నాకేమీ నచ్చలేదు. పిల్లల్ని ఒక్కదెబ్బకూడా కొట్టినట్టు లేదు. బెత్తాలు విరక్కపోతే పిల్లలకు చదువువస్తుందా'? అని తమాషాగా వాళ్ళఅక్కగారితో అప్పుడప్పుడంటూవుండేది.

మా యిద్దరికీ ఏ జన్మాంతరబాంధవ్యమో లేకపోతే ...ఎక్కడి వాణ్ణో వచ్చి పిల్లలతో పడటం ఏమిటి? ఆమెకు నామీద అంత ఆదరం ఎందుకు? ఇది చివరకు ఎలా పరిణమిస్తుందో మరి!

ఉద్యోగ వ్యవహారాలేమిటో, తనేమిటో – అంతేతప్ప ఇంజనీరుగారికి మిగతా సంగతులేవీ పట్టవు కాబట్టి...ఆయనకు నెలకు ఇరవైరోజులుపైగా 'క్యాంపు'లే ఉంటాయి కనకా...సరిపోయింది గాని...ఆయనకే అనుమానం కలిగితే ప్రాణాలు తీసేసి ఆ తోటలోనే ఎక్కడో పాతేయిస్తాడు. నాకు భయంగానే ఉండేది. హృదయంతో పాటు మెదడుకూడా పని చేస్తూ ఉండేది.

ఒకనాడు భోజనాలు చేస్తూ ఉండగా ఛాయాదేవి అన్నది.

'మాస్టర్ జీ! మీ ఆవిణ్ణి చూడాలని వుంది, ఎప్పుడు తీసుకొస్తారు?

నేను మాటాడలేదు. నవ్వి ఊరుకున్నాను.

'ఆవిడ ఎలావుంటుందో కాస్త వర్ణించండి. అందంగా ఉంటుందా?

నాకు సిగ్గేసింది. ఆమె అక్కగారూ ఉంది అక్కడ. నేను అప్పటికీ జబాబు చెప్పకపోవటం చూచి.

'ఔను ఎవరిభార్యా అందంవాళ్ళు చెప్పుకుంటూ రేమిటీ?' అని దీర్ఘంతీసి పకపకా నవ్వేసింది.

మరో రోజు మధ్యాన్నమప్పుడు టీ చేసి స్వయంగా నాగదిలోకి తీసుకొచ్చింది.

'మాస్టర్ జీ! పూర్వకాలంలో ఇద్దరు, ముగ్గురు భార్యల్ని కూడా చేసుకునే వారుట. ఇప్పుడాఆచారం సమసి పోయిందేం?'

'అప్పుడు మన దేశంలో తిండిలేక మాడినవాళ్లెవరూ లేరు. ఆడవాళ్ల జనసంఖ్య ఎక్కువగా ఉండేదేమో. ఇప్పటికీ పాటక జనుల్లో లేకపోలేదాఆచారం. ఎంతమంది భార్యలుంటే అంత భాగ్యవంతుడువాడు...అందరూ పనిచేసి సంపాదించుకొస్తారు. భార్యాత్వం అనిష్ట హేతువేగా!'

ఆమె నవ్వింది.

'అయితే ఉద్యోగమేదో చెయ్యాల్సిన అవసరం లేకుండా తగినంత ఆ స్త్రీకో కూడా వొస్తే రెండో భార్యను స్వీకరించి వచ్చునేగా మీ ఉద్దేశం!'

అర్థలాభమే పరమార్థంగా జరిగే పెళ్లిళ్లు నాకు నచ్చవు. మా ఆవిడకు-వాళ్ల అక్క-చెల్లెళ్లందరూ పంచుకుంటే-మగపిల్లలు లేరు...నాలుగెకరాల మాగాణిపొలం వొస్తుంది. అందుకనే నాకా సంబంధం చేశారు. అందుకనే నాకు ఆమె అంటే...

'ఇష్టంలేనివాళ్ళు మరి ఎందుకుచేసుకోవాలి మొదట?'

నా యిష్ట ప్రకారం ఏది జరిగిందనీ నా జీవితంలో!

ఆమె జాలిగా ఒక చిరునవ్వు పారేశింది.

మర్నాడు ఛాయాదేవికి నూరు రూపాయలు మని యార్డ రొచ్చింది. సికింద్రాబాదులో స్వంతయిల్లు ఉంది ఆమెకు. అద్దె కిచ్చారు, దానిబాపతు.

ఆ సాయంత్రమే 'షాపింగ్' కు వెళ్లాం కారులో.

ఆ రాత్రి భోజనంచేసి పడుకోటానికి నా గదిలోకి వెళితే...మంచంమీద ఆమె కొనుక్కొచ్చిన 'రగ్' కనిపించింది. రోజులు గడిచిపోతున్నవి. ఏ మధుర క్షణాలకోసం ఈ శ్రీహరిరావు జన్మెత్తాడో...అవి దగ్గిర పడ్డవి.

ఆ రాత్రి నేనే గాఢనిద్రలో ఉన్నాను. ఎవరో భోజనం తట్టి లేపారు. ఉలికి పడ్డాను.

'ఎవరు?'

మెల్లగా మాటాడండి భయపడతారెందుకూ? నేనే.

ఆమెలోపలికి వచ్చినప్పుడు 'స్విచ్' వేసింది కామాలు గదినిండా విద్యుత్ప్రవాహాలే.

ఒక నిముషంసేపు ఎవరునూ పలకలేదు. ఆ నిశ్శబ్దంలో ఎంత గాంభీర్యం! ఎన్ని ప్రగాఢభావాల సంచారం! యోగులకే ఎరుక.

టేబిల్ మీంది 'బిగ్ బెన్' గడియారం మాత్రం నా గుండెల్లో దీటుగా టిక్కు-టిక్కు మంటోంది.

'నేనే మాస్టర్‌జీ!'

ఆమె పెదవులమీంద చిరునవ్వు తళుకులు ఉన్నవి. ఆ తళుకులు మధురాతి మధురాలైన ఏవో విషాద రేఖల్ని కూడా మొలచికొని ఉన్నవి. ఉభయ సంధ్యల ఏకీభావమునలె ఉన్నదా చిరునవ్వు. ఇన్నాళ్ళనించీ ఆమె దేవత అనుకున్నాను: ఇంత విషాదాన్ని ఎక్కడ దాచుకుందో. దాన్ని కూడా సంతోష తరంగాల్లోకే మార్చుకుంది. అదే దేవత్వమని భావించాను. కాని కృత్రిమమే అది. ఇప్పుడే ఆమె ఎంతో సహజంగా అందంగా కనిపించింది. నాకు నాలోని ఆత్మవలె...ఆమె కూడా ఎంతో సన్నిహితురాలుగా కనిపించింది. నేను ఆమెకు ఛాయనా? నాకు ఆమె ఛాయగా?

ఇంతలో నా మెదడు నేనున్నాననుకొంటూ తొంగిచూస్తోంది.

'ఇంత రాత్రప్పుడు...నువ్వు...ఇక్కడ'...

'నాకు నిద్రపట్టటం లేదు. హాయిగా వెన్నెలకాస్తోంది. తోటలోకిపోదాం'

'నువ్వు ముందు వెనుకలు ఆలోచించటం లేదు.'

'అది నాకు చాతగాని పని. ప్రవాహ వేగంలో కొట్టుకుపోవటం తప్ప నాకేమీ తెలీదు.

'ఇంజనీరు కూడా 'క్యాంపు' నించి ఇవాళే వచ్చారు. ఈపాటికి మా అక్కగారి కౌగిళ్ళలో ఒళ్ళుమరచి పోతా డాయన.

నాకు నవ్వొచ్చింది. ఆశలు పెరిగాయి. కాని మస్తిష్కం మెదడుకు పని కల్పించుకున్నా. అన్నాను:

నువ్వు నన్ను మరీ అపాయకరమైన పరిస్థితుల్లో పెడుతు న్నావు?

ఆమెకు కోపంవచ్చింది. కళ్లనిండా నీళ్లుతిరిగినై. చప్పున వెనక్కు తిరిగి పోతోంది.

'అప్పుడు దైవమో, దయ్యమో— నన్ను ఏది ఆవే శించిందో నాకు తెలీదు. వెంటనే నాలుగడుగులు వేసి చెయి పుచ్చుకున్నాను. ఆమె నాకు అభిముఖంగా తిరిగింది.'

'ఛాయా!'

'మాష్టర్ జీ!'...

అమర్నాగే మామామయ్య ఎక్కణ్ణించో ఊడిపడ్డాడు. ఎలా కనిపెట్టాడో మరి నా ఉనికి! నాకు ఒక ఆరునెల్ల కొడుకు అని ఆయన తెచ్చిన వార్త.

ఛాయ నన్ను వెళ్ళవద్దని ఏడ్చి మారాం చేస్తుందనుకు న్నాను. ఆమె అలా చేస్తేనే ఎంతో బాగుండి పొయ్యేది. కాని—

'మీరు వెళ్ళాల్సిందే, కాని ఈసారి వచ్చేటప్పుడు మీ ఆవిణ్ణికూడా తీసుకురండి' అన్నది.

'నేను వెళ్ళను ఛాయా!'

'చాల రోజులయింది. ఆమె చాల విచారపడుతుంది'.

'నేను మళ్లీదాన్ని చూడను. దాన్నేమిటి? నిన్ను తప్ప ఈ కళ్ళు మరెవతెనూ చూడాలని కోరనిక'.

ఆమె నవ్వింది...పసిపిల్లవాడి తెలివి తక్కువ మాట లకు నవ్వినట్టు.

'ఔను ఛాయా! నీకు భర్త లేడు. నాకు భార్యంక కూడా...ఆమె నానోరు మూసేసింది'.

'మీరు మాటాడకుండా వెళ్ళిరండి. మీరు తొందరగా తిరిగి రాకపోతే నేనెంత బాధపడతానో మీ ఆవిణ్ణి కూడా తీసుకురాకపోతే అంత కిబ్బడిగా దుఃఖపడతాను. ఆమెను మీరు ఉసురుపెట్టారంటే మాత్రం మీ ఛాయ ఇక లేదనే అనుకోండి' అని ఆమె చరచరా లోపలికి పోయింది.

మా మామయ్య నన్ను మా ఊరు తీసుకొచ్చినందుకు! గవర్నమెంటువా రాయనకు పత్తేదారుపని ఇయ్య వచ్చునని అంతా అభినందించారు. బంధువులందరి ముందూ నేనొక అపరాధివలె అయినాను. అందరూ నన్ను తిట్టినవాళ్ళె మొండికట్టైనుట; బంధుప్రీతిలేదుట; నాకు, మా ఆవిడ అన్న ఎత్తి పొడుపు మాటలు వింటోంటే ఆమెను హత్య చెయ్యాలనిపించిది. ఆఖరికి నా ఆరునెల్ల కొడుకుకూడ...తల్లికి మల్లే చిన్నవైన ఆకన్నులు విప్పి... ఎవడవురా నువు అన్నట్టు చూచాడు.

ఆ మర్నాడే మామయ్య జేబులో పదిరూపాయల నోటు కాజేసి ఎవరికీ చెప్పకుండా విజయవాడ వచ్చేశాను.

హైదరాబాదు వెళ్ళిపొమ్మని గుండె తొందరచేస్తూనే ఉంది. కాని భార్య సహితంగా గాని రావద్దని ఛాయాదేవి గట్టిగా శాసించింది. నాకేటూ పాలుపోలేదు. కాశీకి పోతూ పిల్లిని చంకబెట్టుకు వెళ్ళినట్టు మా ఆవిడ కూడా ఎందుకూ? నాకు పిచ్చెత్తినట్టయిపోయింది అయిదారు నెలలు విజయవాడలోనే సిగరెట్లు కాలుస్తూ శూన్యహృదయంతో వీధులవెంట తిరిగాను. చివరకొకనాడు స్టేషనుకేసి పి.కారుగా వెళ్ళిన ఛాడ్కి టిక్కట్టుకొని హైదరాబాదు వెళ్ళాను.

వాళ్ల యింటిముందు బండి దిగాను. గుండెలు దడదడా కొట్టుకున్నాయి నేనేదో మహాపరాధం చేసిన ట్టనిపించింది. వెనుకాడుతూన్న కాళ్లను బలవంతాన ముందు కీడ్చుకొని లోనికి వెళ్లాను.

ఆ గది గుమ్మంవద్ద ఒక కాలుఅటూ ఒక కాలు ఇటూ —నిశ్చేష్టుడినై నిల్చిపోయాను. ఆ రోజులలో నాకుగాను వాళ్ళు ప్రత్యేకించినగది అదే. లోపల ఒక మంచంమీద ఛాయ-హీనస్వరాన — మధ్య మధ్య బాధాసూచకంగా మూలుగుతూ—పక్కనే కూచుని ఉపచారాలు చేస్తోన్న అక్కగారితో — ఏమేమో మాటాడుతోంది. మాటలో, పలవరింతలో మరి అవి!

నా ముఖంలో నెత్తురు చుక్కలేదు. దిగాలుపడి నిల్చున్న నన్ను ఇంజనీరుగారి భార్య చూచింది. వెంటనే లేచి లోనికి వెళ్ళిపోయింది.

ఆ తరువాత నేను ఎలా వెళ్లి ఛాయ మంచంమీద కూలబడ్డానో నాకు తెలియదు. 'మాస్టర్ జీ!' అని అప్పూడామె ఆప్యాయంగా, ఆవేశంగా, అపార దుఃఖం అంతర్వాహినిగా ఆమె ఉచ్చరించిన పదం జన్మజన్మాలకు నా హృదయాంతరాళంలో స్పందిస్తూనే ఉంటుంది.

నా నోటివెంట మాటరాలేదు; నా కన్నులవెంట అశ్రువులు స్రవించలేదు. ఆమె పాదలపై వ్రాలి, పశ్చాత్తాప కీలికలలో గిలగిల తన్నుకుని చచ్చిపోవాలని తహతహలాడుతూ—నేను చెప్పలేను, ఆ సమయాన ఎంతబాధ పడ్డానో.

చైతన్యంలేని ఆమె అంగుళులు నా చొక్కా-గుండీపై ఏమోతడుముకుంటూ ఉన్నాయి. 'మీరు నన్ను క్షమించండి మీ బిడ్డడిని మీకు వొప్పజెప్పలేక పోయాను. మాబావగారి సంఘమర్యాద నిలుపుకోసం ఏడు నెలలుమాత్రమే నా కడుపులో పెరిగిన మీ ప్రేమ ఫలాన్ని నేనే చిదిమివేశాను. అందుకు ప్రతిఫలంగా నాటినించీ మంచంబట్టివున్న నన్ను నేడో రేపో భగవంతుడే త్రుంచివేస్తాడు. మీ దర్శనం కోసమే బ్రతికివున్నానేమో!'— అన్నదామె క్షీణాక్షీణమైన కంఠస్వరాన.

నేనొక శోకసముద్రంలో ఉక్కిరి బిక్కిరై ఉన్నాను. నా గుండెలోనించి మాట పెగలటంలేదు. పెగిలి ఆ క్షణాన ఆ గుండె వ్రయ్యలై పోతేనే బాగుండేది.

ఆమె నాస్థితి గుర్తించినట్టు ఆ కన్నులలో కరుణ పొంగింది. 'మీ భార్యలో నన్ను చూడండి, నన్ను మరచి పోకండి...' అన్నదామె గద్గద కంఠంతో.

'ఇంజనీరుగారు వెచ్చేవేళ్ళ అయింది. ఇక మిమ్మల్ని త్వరగా వెళ్ళమంటున్నారు. అంటూ వాళ్ల బంట్రోతు నన్ను వీధిలోకి లాక్కొచ్చి వదలిపెట్టాడు.

ఆమె కన్నీళ్ళుతుడిచి నేను అక్కడే విడిచిపెట్టి వచ్చిన ఒక్క జేబురుమాల మాత్రమే ఈ జీవితంలో ఆమెకు నేను ప్రసాదించిన ప్రేమకానుక. బహుశః అదే చితిమంటలలో వేగిపోయే ఆమె శవానికి చల్లదనం కలిగించి వుంటుంది.

శ్రీహరిరావు ఇక మాటాడలేదు. మబ్బులో దాగిపోయి చంద్రుడు సిగ్గుపడుతున్నాడు. నా హృదయంలో ఏవేవో భావాలు తన్నుకులాడుతున్నాయి.

# '....సుఖంగా ఉన్నావు కదా!'

౧

నేను మా పుట్టింటికి వచ్చి నెలరోజులయింది. మా అమ్మ నా చిన్నప్పుడే చనిపోయింది. సోదరులూ లేనే లేరు. మా నాన్నగారు ఒక్కరే ఉన్నారు. అరవై యేళ్ళ వృద్ధుడు. రెండువందల యాభై రూపాయల పెన్షను వస్తుం దాయనకు. వయసులో చాల వైభవంగా బతికినవారు. ఈ జరావస్థలో వంటావిడ, మరి ఒకరిద్దరు నౌకర్లూ తప్ప ఆయనకు ఉపచారం చేసేవాళ్ళెవరూ లేరు. అందుచేత ఆయనకు కొంచెం సుస్తీగా ఉందని ఉత్తరం రాగానే మా వారు నన్ను పంపించారు.

నేను వచ్చిన వారంరోజులకే మా నాన్నగారికి బాగా కులాసాయిచ్చింది. కొంచెం నీరసంగా ఉంటున్నారు. అంతే. నేను తిరిగి వెళ్ళాలని అనుకుంటూనే ఉన్నాను. పంచమి, సప్తమి, దశమి అని గడువులు పెడుతూ రోజులు గడుపుతున్నారు మానాన. రమ్మని మావారు ఉత్తరమేమీ రాయ లేదు కాని—వారి మనస్సు ఎంత సుతిమెత్తనో శరీరమూ అంతే. హోటలుతిండి సరిపడుతున్నదో, లేదో!

రోజూ సాయంత్రమప్పుడు కొంచెం వ్యాయామంగా ఉంటుంది కదా అని మానాన్న అటు పొలాలవైపో, పార్కులోకో షికారు వెళుతూంటారు. తరచు నన్నూ రమ్మంటూండేవా రాయన.

షికార్లు వెళ్ళట మనేది నాకు చిన్నతనంతోనే పోయింది. నేను కాపురానికి వెళ్ళిన ఈ పదిసంవత్సరాలనుంచీ ఎవరేనా పిలిస్తే పేరంటానికి వెళ్ళవలసినప్పుడు తప్ప గడప

దాటి యెరగను. మావారు రివిన్యూ ఇన్‌స్పెక్టరుగా పని చేస్తున్న ఊరు బస్తీ పల్లెకాకండా ఉంటుంది. అక్కడ పార్కు లంటూ ఏమీలేవు. అది కాక స్త్రీలు షికార్లు వెళ్ళటం చాల నింద్యంగా పరిగణింపబడే వాతావరణం అక్కడ.

అలవాటు లేకపోవటం మూలాన నాకు చాల భిడియంగానే ఉండేది. అనేకమంది పురుషులు వచ్చి కూచుని ఉండే ఆ పార్కులో మా నాన్నగారి పక్క నడుస్తోన్నప్పుడు. కొంతమంది స్త్రీలుకూడా—పెద్దపెద్ద ఉద్యోగస్తుల భార్యలూ, కూతుళ్లూ వచ్చేవాళ్లే, కబుర్లు చెప్పుకుంటూనో, పిల్లల నాడిస్తూనో, కిలకిల నవ్వులతో గాలితరంగాల్ని నింపుతూండే వారు. నాకుమాత్రం ఏమిటో భయం భయంగా ఉండేది. మా నాన్నగారి కులాసాకోసం కాకపోతే నేను వెళ్లకపోయే ఉందును.

వెళ్లినా నలుగురూ ఉన్నచోట కూచునేవాళ్లంకాదు. ఆ పార్కు చాలపెద్దది. విజనంగా ఉండే ఒకమూల వేప చెట్టుకింద సిమెంటుబల్ల మా కోసం రిజర్వుచేయబడినట్టు ఎవరూ అక్కడికి వెళ్లేవాళ్లుకాదు.

మొదటి రోజున ఆ సిమెంటుబల్లమీద మా నాన్న గారి మాటలకు జవాబులిస్తూ కూచున్నానేగాని తలెత్తిచూడ లేకనే పోయాను. క్రమశః మనుష్యులకేసి చూడగలిగిన ధైర్యం లేకపోయినా కాస్త ఆ 'రేడియో లౌడ్‌స్పీకర్ల' కేసి, చెట్లకేసి చూపులు పోనిచ్చాను. చివరకు పార్కులోకి రావటం అంత భిడియపడవలసిన పని కాదని తెలుసుకో గలిగాను.

౨

ఆ నాడు ఆ వేపచెట్టుకింది సిమెంటు బల్లమీదనే కూచున్నా వెళ్ళి. కూడావచ్చిన నాన్నగారు ఎవరో స్నేహితుడు కలిస్తే ఆయనతో మాటాడుతూ రేడియో రిసీవింగు స్టేషనులోకి వెళ్ళారు.

ఆకాశంనిండా మేఖాలు కమ్ముకున్నై; వర్షం కురుస్తుందేమో అన్న భయం కలిగించేటంత నల్లగా మాత్రం లేవు. సూర్యాస్తమయ మయ్యేవేళ. సూర్యుడు కనిపించటంలేదు; ఆ పశ్చిమభాగమంతా తెల్లని యవనికలాగ ఉంది ఆకాశాన అక్కడక్కడ కొన్ని పక్షులు రెక్కలు కదల్చకుండా మంద సంచారం చేస్తున్నవి. వీస్తోన్న చల్లని గాలికి నా దగ్గరి వేప చెట్టుమీది కొమ్మలు ప్రియుల చక్కలిగింతలకు తుళ్ళిపడే యువతుల్ని అనుకరిస్తున్నవి. నా కప్పుడొక వింతైన పాట వినిపించింది——

“నీలిమాకాశసౌధాన నెల నెలంత
నక్షత్రవెన్నెల వలచి——పొంగారుచున్న
అశ్రుజలరాశి బడి, ఈదులాడుకొనుచు
అరుగుచున్నాను యామ్యాలయమున కకట!”

రహస్యంగా ఉపభర్తను కూడుకోటానికి వెళ్ళే వగలాడి గుండె దడదడలాగ బడబడా వచ్చేసింది, వానజల్లు. పాటలోని కరుణవేదనకు ఖేచరుల కన్నీటి ముత్యాలా, వాన చినుకులా? తటపట శబ్దించినై చెట్ల ఆకులమీద.

ఇంతలో మొయిలుతెర విడిచిపోయి సూర్యబింబం ప్రకాశమానమయింది. వానజల్లు చరచరా దాటిపోయింది,

పరిణతాత ప్రవాహంలో సుస్నాతములై బాలవృక్షాలు విరాజిల్లుతున్నవి. ఒక రంగురంగుల మెట్ట తామరపూవు తుమ్మెదపాట వింటూ లజ్జ నభినయిస్తోంది. రాగ రంజితమై కనిపిస్తోంది వాతావరణం.

3

ఆ తగ్గుస్థాయిలో అంత మధురంగా ఆపాట పాడింది ఎవరు? వెనక్కు తిరిగి చూచాను. కొంచెం దూరాన ఒక ఎలక్ట్రిక్ స్థంభానికి ఆనుకుని అటు ముఖం పెట్టి కూచున్నా డెవరో. నాకు నీడ యిస్తోన్న వేపచెట్టుమీది ఆకులసందుల్లో నించి రెండు చల్లని నీటిచుక్కలు నా చెక్కిలిమీద రాలిపడ్డవి. తుడుచుకుని మళ్ళీ సరిగా తిరిగి కూచున్నా.

ఛందోబద్ధములైన మధురశబ్దాలలోనూ ప్రకృతిసౌంద ర్యంలోను, ఎంత ప్రభావం ఉంది? అబోధపూర్వములైన జన నాంతర సౌహృదాల్నికూడా స్మరింపజేస్తాయి. నామనస్సు మంచు తెరలు చీల్చుకుంటూ స్మృతిపథంలో పరుగిడుతోంది. ఆగింది ఒకచోట చటుక్కున ...

... మొదటి రీల్—— స్కూలుకు వెళ్ళే దోవలో ఒక చిన్న సందు. రఘువు వుండే యిల్లు అక్కడే. స్కూలు ఫైనల్ కుర్రాడు; బాగా ఆడతాడు ఫుట్ బాల్; రెండుమూడు మెడ ల్సు ఉన్నాయి అతనికి...చేతిలో ఒకకాగితం పట్టుకుని వాళ్ల గుమ్మందగ్గర నిల్చుని ఉన్నాడు...

ఆకుపచ్చ సిల్కు పరికిణీమీద గులాబిరంగు వలెవాటు తో——చేతిలో థర్డుఫారం పుస్తకాలు పట్టుకుని వస్తోంది వీణ

ఆమధ్యాహ్నం పు టెండకు నుదుటిమీద చెమటచుక్కలు చెదరినవి.

'ఇదిగో, వీణా!'

ఇదివర కెన్నడూ రఘువు తన్ను పలుకరించలేదు. సిగ్గొచ్చింది వీణకు. బుగ్గలు జేగురించినవి. నడక మందగించింది.

రఘువు మెట్లు దిగివస్తూ 'మరేంలేదు; ఈ సెలవుచీటి కాస్త హెడ్మాస్టరుగారి కిచ్చి వెయ్యి. ఇందాకటినించీ చూస్తు న్నాను; ఏ కుర్రాడూ కనిపించలేదు. ఇవాళ తల నొప్పిగా ఉంది; స్కూలుకు రాలేను' అంటూ కాగితం అందించాడు.

తను తీసికెళితే బాగుంటుందా? అన్నప్రశ్న వచ్చింది గాని, వీణ ఆచీటీ అందుకోకండా, నిరాదరణగా సాగిపోలేక పోయింది. ఆమె చీటీ తీసుకుంది. జడలోని చేమంతిపూవొకటి కింద వాలింది; రఘువు అది వొంగి తీసుకుని ఆఘ్రాణిస్తూ ఇంటోకి వెళ్లాడు.

...   ...   ...

రెండో రీల్; జిమ్‌ఖానాక్లబ్బు ఆవరణలో ఫుట్‌బాల్ పోటీపందేలు జరుగుతున్నై. ఆరోజున రఘుకు 'రౌండు' లేదు. వాలంటీరు పని చేస్తున్నాడు. వీణా, ఆమె తండ్రీ ఆటచూచేం దుకు వచ్చారు. ఎంత మర్యాద చేస్తున్నాడు రఘు వాళ్లకు; తనయిల్లుకాకపోయినా. ఆమర్యాద! ఆస్వాగతం! అనేకమంది వస్తున్నారు; వాళ్లంతట వాళ్లే ఖాళీగావున్న కుర్చీలలో కూ చుంటున్నారు. రఘు ఆ తండ్రీ కూతుళ్లకు ఎదురు వెళ్లాడు; తీసుకొచ్చి ప్రత్యేకాసనాలు చూపించాడు; సోడాలు కావా

లేమో అడిగాడు. ఆయన పెద్ద గవర్నమెంటు ఉద్యోగస్థుడవటంచేత అంతమర్యాద జరుగుతోందనుకున్నారంతా. 'వీణను చూచేసరికి మనవాడెలాఅయినాడో చూచావ్నటా' అంటున్నాడు రఘు తరగతివాడొక్కడు పక్కని స్నేహితుడితో. 'స్కూలు ఫైనల్ అయాక వాళ్లింటో బట్లరు ఉద్యోగమే మనవాడికి' అని రెండోవాడి ప్రతివచనం. వీణ వాళ్లిద్దరికేసి చురుగ్గా చూచి తలవొంచుకుంది.

... ... ...

మూడోరీల్: తూర్పువేపు ఆకాశాన బారెడుమాత్రం ఎక్కివచ్చిన సూర్యబింబం దర్శనీయంగా ఉంది. జడవేసుకుని, నీళ్ళుపోసుకుని, గళ్లపరికిణీ గోధుమరంగు పమిటా సింగారించుకుని, వీణ వాళ్ల పెరటితోటలో పువ్వులు సేకరిస్తోంది. వనస్పతులు తమంతతామే గాలికి వొంగి పువ్వు లందిస్తున్నై. బైటనుంచి...

'వీణా!'

ఆమె ఉలికి పడ్డది. ఎవరది? గోడ అవతల వీధిలో రఘును చూచింది వీణ, పుష్పాపచయం మానేసి, తలెత్తి.

'నువ్వా? రఘు! లోపలికొస్తావా? ప్యాసయ్యావు కామాలు; ఉద్యోగ ప్రయత్నంమీద మానాన్నగారితో మాటాడ్డానికేనా? వున్నారు ఇంటో'

రఘు నిశ్శబ్దంగా ఆమెకేసిచూస్తూ వుండిపోయాడు

'ఏమిటో విచారంగా వున్నావే!'

'ఏమీా లేదు ... మీరు రేపేనా ప్రయాణం?'

'ఔను, రేపు సాయంత్రం నాలుగు గంటల బండికి; మానాన్నగారికి బదిలీ అయిందిగా!'

'వచ్చే సంవత్సరం ఘోస్తఘారం ఇక్కడచదవన్నమాట.'

'ఊహుఁ, అక్కడే...లోపలికి రా, భయం లేదు.'

'నాకు పువ్వులు కావాలి.'

వీణ పక్కున నవ్వింది. ...

'ఎందుకు నీకు పూలూ?'

రఘు మాటాడలేదు. గంభీర మౌనముద్ర!

'ఏం జేసుకుంటావు పువ్వులు?'

'కావాలి.'

'మీా చెల్లెలి కిస్తావా? నీకు చెల్లె లుందా అసలు?'

ఇంతలో ...

'అమ్మా! వీణా! ... లోపలినించి కేక.

'అదిగో మానాన్నగారు పిలుస్తున్నారు, వెళ్లాలి' ... వీణ వెళ్లిపోడానికి వుద్యుక్త అయింది.

'పువ్వు లియ్యవూ మరి?'

'నీకెందుకు లెద్దూపూలు!' అని వీణ గబగబా వెళ్లింది. ఒక్కసారిమాత్రం వెనక్కి తిరిగిచూచింది. ఎంతదీనంగా, కళావిహీనంగా వుంది అతని ముఖం!

మళ్లీ ఇన్నాళ్లకు ఆ కళావిహీనముఖమే ఇవాళ...

.. సినిమా దృశ్యాలు ఆగిపోయి...మానాన్నగారు వస్తున్నారేమోనని చూచాను రేడియో రిసీవింగుస్టేషను కేసి.

ఆయన ఇంకా మిత్రుడితో మాటాడుతూనేవున్నారు కామాలు లోపల.

ఇంతలో నా వెనుక ఆ ఎలక్ట్రిక్ స్తంభం దగ్గరి వ్యక్తి లేచాడు. అతని ముఖం కనిపించింది. ఔనా, కాదా, అన్న సంశయం ఎంతోసేపు లేదు.

ఆకళావిహీనముఖమే పన్నెండేళ్ల తరువాత ఇవాళమళ్లీ చూస్తున్నాను.

వెళుతూ వెళుతూ నేను కనిపించగానే ఆగాడు. పోయినప్రాణం లేచివచ్చినవాడులాగ అయి 'ఎవరు? వీణా'... మాటలు కావవి. ఆవేశపూరితమై పగిలిపోయిన గుండె తునకలు ...

'ఔను, నేనే.' సిమెంటుబల్లమీదినించి దిగి నమస్కారం చేశాను.

అతడు నన్ను సమీపించాడు. అతడు నాకేసి చూచే చూపులలో పాలసముద్రం పొంగుతోంది; ఒక నిమిషంకిందట నిస్తేజమై వుండిన అతని ముఖమండలం చంద్రబింబాన్ని బుకాయిస్తోంది.

'సుఖంగా వున్నావుకదా వీణా! ... ఈవూళ్లో వుంటున్నారా? ... మీవారు ... ఏం పని? ...'

టూకీగా చెప్పాను: మానాన్నగారు రిటైరు అయింతర్వాత ఈవూళ్లోనే ... అన్ని సౌకర్యాలూ వున్నాయని ... ఇల్లు కట్టుకుని వున్నారనీ, ఆయన కీమధ్య సుస్తీ చేసినందున చూచిపోయేందుకు వచ్చాననీ ... ఇంకా ...

'నువ్వు చాల మారిపోయావు వీణా. నా మనసులో వున్న ఓ అప్పటి ధర్మఘారం వీణ మారేలేదు. అందుచేతే చప్పున గుర్తుపట్టలేక పోయాను. ఊఁ కులాసాగా వున్నావు కదూ!'...ఇంకాఏమిటో కావలసినంత చెప్పాలనుకుంటూ... చెప్పలేని మూగవాడువలె... ముఖంలో వివిధభావశబలత దానంతట అది ప్రకటమౌతూవుండగా ... నాకేసే చూస్తూ నిల్చిపోయాడు.

నే నతని ముఖంలోకి చూళ్ళేక చూపుల్ని అతనిచేతి లోని పుస్తకంమీాదికిదించాను. అతని భావతీవ్రతకూ, నాభావాసహ్యతకూ, రవంత విశ్రాంతి కలిగిద్దామన్న తలపుతో నేనువాక్కు తెచ్చుకుని...

'ఆ పుస్తకం...'

అర్థోక్తిలోనే అత డందుకుని...'ఈపుస్తకమా! ఇది 'ఎండిమియాన్' అని ఒక ఇంగ్లీషుకావ్యం. 'కీట్సు' కవి రాశాడు. ఒకడు చంద్రబింబాన్ని వరించి, దానికోసం తహా తహాపడి, హతాశుడై మరణిస్తాడు—అదీ ఇందులో కథావస్తువు. ఇది నా నిరంతర పారాయణ గ్రథం' అన్నాడు.

ఒక నిమిషంసేపు ఎవరమూ మాటాడలేదు. ఒక పెద్ద గాలికెరటం వృక్షశాఖల్ని రివ్వున ఊగించి దాటిపోయింది.

'ఇక నేను వెళ్లొస్తాను వీణా! ఎన్నాళ్లకు కనబడ్డావు! ఇవాళ సుదినం. నాహృదయంలోని హిమాలయపర్వతగహ్వారాల్లో విద్యుత్కాంతులు ప్రజ్వలిస్తున్నట్టు అనుభవిస్తున్నాను. వెళ్లనా? నువ్వు సుఖంగా వున్నావుకదా...!'

నేను తలెత్తి అతని కన్నులలోకి చూచాను. మిలమిల మెరుస్తోన్నవి అవి . . . దీపశిఖ అంతిమకాంతివలె.

నా నమస్కారం అందుకుని వెళ్లిపోతున్నా డతను. నేను అటుకేసే చూస్తూ స్తంభీభూత నయాను.

ఇప్పటికీ నా కావాక్యం చెవులలో ధ్వనిస్తోంది: 'నువ్వు సుఖంగా వున్నావుకదూ!'

